[redacted]టు, నిలుపుట
[redacted]ట
[redacted]కం పిండుట నలుపుట బాధ పెట్టుట
పరిపూజన గౌరవించుట ఆదరము
పరిపూత వి పవిత్రము చేయబడినది
పరిపూరణ ని పుట చక్కబఱచుట
పరిపూర్ణ వి పూర్తిగా ని డినది
పరిపూర్తిః సీ చక్కగా ని డుట పూర్ణత
పరిపోషకః చక్కగా పోషి చువాడు
పరిపోషణ చక్కగా పోషి చుట
పరిప్రశ్నః ప్రశ్నించుట
పరిప్లవ వి తేలునది కదలునది వః నావ నీరుకోడి
పరిప్లుత వి మునిగినది పూర్ణమైనది
పరిప్లుష వి దహి పజేయబడినది తం పజేయబడినది
పరిబర్హః ర్హణ శ్వేతచ్ఛత్రము మున్నగు రాజలా ఛనము పరివారము ఆ స్తి స పద
పరిబృ హణ అభివృది క్షేమము
పరిబృఢః ప్రభువు
పరిభ గః వెదజల్లుట ముక్కలుచేయుట
పరిభర్త్సన బెదరించుట
పరి (ర్రీ) భవః అవమానము అనాదరము
పరిభవిన్ వి అవమానించువాడు
పరిభావః అవమానము
పరిభావిన్ వి అవమాని చువాడు
పరిభాషణ మాటలాడుట
పరిభాషా స భాషణము నింద గ్రంథస క్షేపము నుద్దేశి చిచేయు సంకేత విశేషము
పరిభాషణ ని దారూపమగుఆలాపము
పరిభుగ్న వి వ గినది
పరిభూత వి అవమాని పబడినది
పరిభూతిః సీ అవమానము
పరిభోగః సుఖానుభవము సంభోగ సుఖము
పరిభ్ర శః పడిపోవుట,తప్పి చుకొనుట
పరిభ్రమః పరిభ్రమణ అ తటను తిరుగుట
పరిభ్రష్ట వి పతితుడు
పరిమ డల వి వర్తులాకారము కలది
పరిమరః -రన త్రొక్కుట పత్తి డి చేయుట ఎ డుట నాశము గాయ పఱచుట
పరిమలః సుగ ధము సుగంధవస్తువు లను నూరుటచే కలిగిన సువాసన సుగ ధద్రవ్యము
పరిమాణం కొలచుట తూచుట కొలత
పరిమారః -రణ వెదకుట
పరిమార్జనం అ తటనుశుభ్రముచేయుట
పరిమిత వి తూచబడినది మితము కలది
పరిమితిః సీ పరిమాణము
పరిమిలనం సంపర్కము స్పర్శము

పరిమృదితం పాదములచే త్రొక్క బడినది ఆలింగనము చేసికొన బడినది
పరిమృష్ట వి ఉదుకబడినది తాకబడి నది వ్యాప్తమైనది
పరిమేయ వి అల్పమైనది పరిమిత మైనది
పరిమోక్షః - క్షణం విడచిపెట్టుట మోక్షము
పరిమోచిత వి విడువబడినది
పరిమ్లాన వి వాడినది అలసినది క్షీణించినది
పరిరంభః - భణం ఆలింగనము
పరిలఘు వి మిక్కిలి తేలికయైన
పరివత్సరః సంవత్సరము సంవత్స రము ఆవృత్తమగుట
పరివర్జనం విడచిపెట్టుట త్యాగము చంపుట
పరివర్తనం మార్పు
పరివర్ధనం పెరుగుట
పరివసథః గ్రామము
పరివాదః అపవాదు నింద
పరివాదక - దిన్ వి నిందించువాడు
పరి (రీ) వాపః గొఱుగుట విత్తుట జలాశయము
పరి (రీ) వారః పరిజనము, కత్తి యొఱ మూత
పరివారణం మూత, అనుచరుడు
పరివారిత వి చుట్టబడినది, వ్యాప్తమైనది
పరివృఢః ప్రభువు, రాజు
పరివృత వి వ్యాపృడు సేవింపబడిన వాడు
పరివృత్తి సీ వినిమయము మార్పు
పరివేషః పరిధి సూర్యుడు లేక చం ద్రుని చుట్టును ఏర్పడు గూడు
పరివేషణం భోజనము వడ్డించుట చుట్టుకొలత
పరివేష్టనం చుట్టివచ్చుట చుట్టుకొలత కప్పు
పరివేష్టృ ఆహారము వడ్డించువాడు
పరివ్యాధః కొండగోగు నీటిప్రబ్బలి
పరివ్రజ్యా తిరుగుట సన్యాసము
పరివ్రాజ్ పరివ్రాజకః పు సన్యాసి
పరిశిష్ట వి మిగిలినది- ష్టం అనుబం ధము
పరిశీలనం సంబంధము ఎడతెగని సంబంధము సంయోగము అధ్య యనము
పరిశుద్ధ వి మిక్కిలి శుద్ధిపొందినది
పరిశుద్ధి సీ మిక్కిలి నిర్మలము
పరిశుష్క వి పూర్తిగా యెండినది
పరిశూన్య వి పూర్తిగా రిక్తమైనది ఏమియు లేనిది
పరిశేషః మిగిలినది పూర్ణము సమాప్తి
పరిశోధః - ధనం మిక్కిలి శోధిం చుట శుభ్రముచేయుట
పరిశ్రమః మిక్కిలి యలసట బాధ ప్రయాస ఎడతెగని పని ఉద్యో గము

పరిక్రాంత వి మిక్కిలి యలసినది
పరిక్రాంతి సీ. మిక్కిలి యూరట
పరిషద్ సీ సమూహము గోష్ఠి సభ
పరిషదః - ద్యః సభ్యుడు
పరిషేకః - షేచనం తడుపుట నీరు
పుడిసిట పట్టి భోజనపాత్ర
చుటును విడచుట
పరిష్కృష్టః న్నః పె పుడు కొడుకు
వి మఱియొకనిచే పె చబడినవాడు
పరిష్కారః ష్కృతిః-ష్క్రియాసీ
చక్కబెట్టుట తగవు తీర్చుట
అలంకరిం చుట
పరిష్కృత వి అలంకరింపబడినది
వండబడినది లక్షణము చెప్ప
నిర్వచింపబడినది
పరిష్వక్త వి ఆలింగనము చేసికొన
బడినవాడు
పరిష్వంగః కౌగిలింత స్పర్శము
స్పర్శ
పరిసంఖ్యా లెక్కించుట ఒక విధి
ఒక అర్థాలంకారము
పరిసంఖ్యాత వి చక్కగా లెక్కింప
బడినది
పరిసంఖ్యానం లెక్కపు కూడిక
పరిసమాపన - ప్తిః సీ పూర్తిచేయుట
పరిసరః ఒడ్డు సమీపము
పరిసరణం ఇటు నటు పరుగెత్తుట
పరిసర్పః-ర్పణం ఇటు నటు తిరు
గుట చుట్టివచ్చుట
పరిసర్యా పరిసారః ఇటు నటు తిరు
గుట సమీపమార్గమున పోవుట
పరిస్తరణ వ్యాపించుట ఆవరి
చుట పఱచుట
పరిస్తోమః ఏనుగుపై పఱచు కంబళి
పరిస్రవః కాఱుట
పరిస్రుత్ సీ - స్రుతా కల్లు
పరిహసనం పరిహాసః నగవు
పరిహరణ విడచిపెట్టుట
పరి (రీ) హారః విడచిపెటుట త్రోసి
పుచ్చుట
పరిహాసః నగవు అపహాసము
పరిహృత వి విడువబడినది
పరీక్షకః పరీక్షించువాడు
పరీక్షణం పరీక్షా పరీక్షించుట
పరీక్షిత వి పరీక్షింపబడినది
పరీత వి చుట్టబడినది గడచినది
గడువు మీరినది తొలగినది పట్టు
కొనబడినది
పరీప్సా పొందవలెనను కోరిక
పరీభావ తిరస్కారము
పరీరంభః కౌగిలింత
పరీవర్తః వస్తువుల మార్పిడి
పరీవాదః తిరస్కృతి
పరీవారః పరిజనము
పరీవాహః తూము
పరుః ముడి అతుకు స్వరము కొ ద
పరుత్ అ గడచిన సంవత్సరము
పరుష వి కఠినమైన క్రూరమైన
నిష్ఠురమైన

పరేత వి మృతినొందినది - తః ప్రేత దయ్యము
పరేతరాట్ పు యముడు
పరేద్యవి పరేద్యుస్ అ మఱునాడు తేపు
పరోక్ష వి ఇంద్రియగోచరము కానిది అతీంద్రియము రహస్యమైనది -క్షః సన్న్యాసి -క్షం లేమి అగపడమి
పర్కటీ జువ్విచెట్టు
పర్జన్యః వర్షాధిదేవత మేఘముఇంద్రుడు
పర్ణం తెక్క బాణపుతెక్క ఆకు తములపాకు -ర్ణః మోదుగచెట్టు
పర్ణశాలా గుడిసె
పర్ణిన్ పు చెట్టు
పర్యక్ అ చుట్టును అంతటను
పర్యంకః మంచము
పర్యటనం పర్యటితం తిరుగుట పయనించుట
పర్యంత వి చుట్టబడినది విస్తరించినది -తః చుట్టుకొలత కొన అంచు
పర్యయః లోటు క్రమము తప్పుట తిరుగుట మార్పు
పర్యయణం చుట్టును తిరుగుట
పర్యవసానం తుద అంతము నిశ్చయము
పర్యవసిత వి సమాప్తమైన నశించినది
పర్యశ్రు వి కన్నీటితో తడిసిన
పర్యసనం విసరివేయుట త్రోసిపుచ్చుట
పర్యస్త వి చుట్టునువిసరివేయబడినది తొలగించబడినది
పర్యాకుల వి కలతనొందిన ఆవేదన చెందిన
పర్యాణం జీను
పర్యాప్త వి పొందబడినది సంపాదించబడినది పూర్తిచేయబడినది నిండినది సమగ్రమైనది తగినది చాలినది - ప్తం అ స్వేచ్ఛగా సంతోషముగా చాలినంతగా
పర్యాప్తిః స్త్రీ పొందుట తుది సమాప్తి పూర్ణత తృప్తి సంతోషము
పర్యాయః తిరుగుట గుండ్రముగా తిరుగుట సమాప్తి రీతి పద్ధతి ఒక అలంకారము క్రమపద్ధతిలో మాటిమాటికి వచ్చుట సృష్టి నిర్మాణము
పర్యాలోచనం - నా చక్కగా ఆలోచించుట
పర్యావర్తః - ర్తనం తిరిగి వచ్చుట
పర్యాసః పరిసమాప్తి
పర్యుదంచనం అప్పు లేచుట, తృప్తిపఱచుట
పర్యుదస్త వి తొలగించబడినది తీసివేయబడినది నిరోధింపబడినది
పర్యుదాసః త్రోయుట వేరుచేయుట
పర్యుపాసనం పూజ గౌరవము సేవ

పర్యుషిత వి చలిది నూతనము కానిది చాలకాలము నిలువ చేయబడినది
పర్యేషణ ణా పరిశీలనము గౌరవము పూజ
పర్వతః కొండ గుట ఏదు
పర్వన్ న ముడి కీలు కణుపు ఒక విభాగము పండుగ సమూహము
పర్శుః గొడలి
పల నాలుగు కర్షముల యెత్తు మాంసము
పల (లా) డుః నీరుల్లి
పలలం మా సము
పలాయనం పారిపోవుట
పలాలః ల గడ్డి
పలాశం ఆకు శః మోదుగుచెట్టు రాక్షసుడు
పలాశిన్ పు చెట్టు జువ్విచెటు రాక్షసుడు
పలిక్నీ తెల్లబడిన శిరోజములుగల ముదుసలిది తొలిచూలు ఆవు
పలిత వి చెద్ద తెల్లనైన తెల్లని వెండ్రుకలుకల ముదుసలి – తం వెండ్రుకలు నెఱియుట నెఱసిన వెండ్రుక
పల్య కః మ చము
పల్యంకికా పల్లకి
పల్లవః వ చిగురాకు చిగురుకొమ్మ లత్తుకరంగు
పల్లవిత వి చిగిర్చినది క్రొత్తది వ్యాపించినది
పల్లిః ల్లీ పల్లె గుడిసె
పల్వల చిన్న నీటిగుంట చెఱువు
పవః వాయువు పవిత్రము చేయుట ధాన్యము నూర్చుట
పవన గాలి తూర్పారబోయుట –నం కుమ్మరి ఆవము పవిత్రము చేయుట నీరు
పవనాత్మజః హనుమంతుడు
పవనాశనః పాము
పవమానః వాయువు
పవిః ఇంద్రుని వజ్రము
పవిత్ర వి పరిశుద్ధమైనది పవిత్రమైనది త్ర దర్భ జందెము రాగి వర్షము నీరు అర్ఘ్యపాత్ర నేయి తేనె
పశుః జంతువు క్రూరుడు గొఱ్ఱె
పశుపతి శివుడు
పశ్చాత్ అ వెనుక వెనుకనుండి
పశ్చాత్తాపః అనుతాపము దుఃఖము
పశ్చిమా పడమటిదిక్కు
పశ్యత్ వి చూచునది
పశ్యతోహరః దొంగ కన్నెదుటనే దొంగిలించువాడు
పశ్యంతీ వేశ్య ఒక విశిష్టధ్వని

## పా

పా 1ప (ఎబతి పిబ) త్రాగుట పిల్చుట

పా 2 ప (పాతి, పాత్) రక్షించుట
పాంశు (స్త్రీ) దుమ్ము
పాంసనః వి మలినము చేయువాడు కళంక మాపాదించువాడు దుష్టుడు
పాంసుల వి దుమ్ముతో నిండిన, అప విత్రమైన - లః అపవిత్రుడు స్వేచ్ఛాచారి - లా రజస్వల వ్యభి చారిణి
పాకః వంట పంట కాల్చుట జీర్ణ మగుట పరిణతి పూర్ణత, కావ్య మందలి పాకము
పాక్ష పాక్షిక వి 15 దినములకు (పక్షమునకు) సంబంధించినది ఒక విభాగమునకు సంబంధించినది
పాచక వి వండువాడు - కః వంట వాడు అగ్ని
పాటక వి చీల్చువాడు గ్రామమం దలి యొక భాగము
పాటచ్చరః దొంగ
పాటనం చీల్చుట
పాటల వి తెలుపు కలసిన యెఱుపు
పాటవం నై పుణ్యము చాతుర్యము శక్తి
పాటిత వి చీల్చబడినది
పాటీరః చందనము చేను మేఘము
పాఠః పాఠము వేదాధ్యయనము గ్రంథపు మూలపాఠము
పాఠకః అధ్యాపకుడు గురువు
పాఠనం చదివించుట
పాఠశాలా పాఠశాల
పాఠిన్ పు పాఠకుడు
పాఠీనః కొఱ్ఱ మత్స్యవిశేషము
పాణిః చేయి
పాణిగృహీతీ సీ అగ్నిసాక్షిగా పెం డ్లాడిన భార్య
పాణిగ్రహణం పాణిపీడనం పెండ్లి
పాణితలం అఱచేయి
పాండరః తెలుపు వి తెల్లనిది
పాండితీ పాండిత్యము
పాండిత్యం పండితభావము
పాండిమన్ పు తెలుపు
పాండుః పాలిపోవుట యను రోగము ఒక రాజు తెలుపు వి తెలుపు- పచ్చల కలబోత రంగు కలది - రః తెలుపు
పాండుర వి తెల్లనిది తెలుపు పచ్చల కలబోత రంగు కలది -రః తెలుపు
పాండ్యః దక్షిణభారతమందలి యొక దేశము
పాత వి కాపాడబడినది - తః పడుట
పాతకః - కం మహాపాపము
పాతనం పడవేయుట
పాతాలం భూమికి అధోభాగ మం దున్న లోకము నాగలోకము బడబాగ్ని
పాతివ్రత్యం పతివ్రతాత్వము
పాతుక వి పడునట్టి స్వభావము కల వాడు

పాథసి న నీరు
పాత్రం పానపాత్ర యోగ్యుడు అభి నయము చేయు నాటకపాత్ర
పాథేయం దారిబత్తెము
పాథోధిః సముద్రము
పాదః పావు కాలు కా తి కిరణము వాలవభాగము శ్లోకచరణము కొంత భూభాగము స్తంభము
పాదాతః పాదాతిః పాదావికః కాలి బంటు
పాదుకః కాలినడకన పోవువాడు
-కా చెప్పు (పాదరక్ష)
పాదూ స్త్రీ. పాదుక
పాద్యం పాదములు కడుగుకొనుటకు నీరు
పానం త్రాగుట మద్యపానము కాపాడుట
పానకం బెల్లము ఏలకులు మిరియాలు మొ॥ చేర్చిచేయు పానీయము
పానీయం నీరు వి త్రాగదగినది
పానీయశాలికా పలువు రొక్కచోట చేరి మద ము త్రాగుచోటు
పా థః బాటసారి
పాప వి కీడుకలిగించునది పాపముతో ని డినది చెడునడవడి కలది నీచుడు పతితుడు ప చెడు పాపము దౌర్భాగ్యము దోషము
పాపాత్మన్ పు పాం

పాపన్ పు పాపము కలవాడు
పాపిష్ఠ వి మహాపాపము చేసినవాడు మిక్కిలి దుష్టుడు
పాపీయస్ వి మిక్కిలిపాం
పాప్మన్ పు పాపము
పామన్ పు గజి ఒక చర్మరోగము
పామనః చర్మరోగి
పామర వి గజ్జి (చర్మవ్యాధి) కల వాడు దుష్టుడు నీచుడు మూర్ఖుడు - డః మూఢుడు
పామా గజి
పాయస వి పాలు లేక నీటితో చేయ బడినది - సః -సం క్షీరాన్నము పరమాన్నము
పాయిన్ పు త్రాగుబోతు
పాయుః మలద్వారము
పాయ్యం నీరు పానద్రవ్యము రక్షణము పరిమాణము
పారః ర నది లేక సముద్రపు అవ్వలితీరము ఏదేని వస్తువు లేక విషయపు చివరిభాగము తుది కొన సమీపము
పారగ పారంగత వి దరి చేరినవాడు
పారణ మేఘము స తోషము బం తృప్తినొ ది చుట చూచుట - ణ ణా ఉపవాసాన తరభోజనం
పారతంత్ర్యం పరాధీనత
పారదః పాదరసము
పారదారికః పరభార్యాసక్తుడు

పారదార్యం వ్యభిచారము
పారదేశిక వి పరదేశమునకు సంబం ధించినది - కః విదేశీయుడు యాత్రికుడు
పారమార్థిక వి పరమార్థసంబంధ మైనది పరమ సత్యము వాస్తవ మైనది
పారమేష్ఠ్యం అత్యున్నతస్థానము
పారంపర్య వి వంశానుగతమైన, - ర్యం వంశానుగతము
పారలౌకిక వి పరలోకమునకు సం బంధించినది
పారవశ్యం పరాధీనత
పారశవః ఇనుము ఒక ఆయుధము
పారశ్వధః పారశ్వధికః గొడ్డలి ఆయుధముగ కలవాడు
పారసీ పారసీకభాష
పారసీ (సీ) కః పారసీకదేశపు గుఱ్ఱము - కాః పారశీకదేశీయులు
పారాయణం పూర్ణముగ (కథ మొ॥) చదువుట
పారాయణికః పౌరాణికుడు శిష్యుడు విద్యార్థి
పారావతః పావురము కోతి కొండ - తం ఇనుము
పారావారః సముద్రము - రం ఉభ యతటములు
పారావారీణ వి ఉభయ తీరములకు పోయినవాడు పూర్ణముగ నాకళిం చుకొన్నవాడు
పారాశరః - శర్యః పరాశరతన యుడు, వ్యాసుడు
పారాశరిః వ్యాసుని తనయుడు,శుకుడు
పారాశరిన్ పు సన్యాసి
పారిజాతః కల్పవృక్షము
పారితథ్యా జడబిళ్ల
పారితోషిక వి సంతోషపెట్టునది, - కం బహుమతి
పారిపంథికః దొంగ
పారిపాట్యం పద్ధతి, క్రమము
పారిపార్శ్వం అనుచరులు సేవకవర్గం
పారిపార్శ్వకః అనుచరుడు నాటక మున సూత్రధారునికి సహాయ కుడుగ ప్రస్తావనలో పాల్గొనువాడు
పారిప్లవ వి చలించునది అస్థిరమైనది
పారిప్లావ్యః బాతు
పారిబర్హః వివాహసందర్భమున నిచ్చు బహుమతి
పారిభద్రః దేవదారువృక్షము వేప చెట్టు సరళవృక్షము
పారిభావ్యం జామీను ఇచ్చుట
పారిభాషిక వి ప్రచలితమైన వాడు కలో నున్న సాంకేతికమైన
పారిమాండల్యం అణువు, సూర్యకిర ణమందగపడు ఒక ధూళికణము
పారియాత్రకః సప్త పర్వతములలో నొకటి

పార్వతీ హిమవ తుని కూతురు గౌరి
దేవి న దనః కుమారస్వామి
గణపతి
పార్శ్వః ప్రక్క శరీరపుటిరు ప్ర
పారివర్షం పెండ్లిబహుమతి
పారివ్రాజక పారివ్రాజ్యం సన్యాస
నిర్వహి చు యాత్రామయమగు
ధార్మికజీవనము
పారిషద్ వి సభాస బ ధమైన దః
సభ దు – దాః భగవ తునిసేన
పారిషద్యః సభయం దుపస్థితుడు
పారిహార్యః కేయూరము – ర్య
పట్టుకొనుట తీసుకొనుట
పారిహాస్య పరిహాస వచనము
పారీ ఏనుగు కాలి స కెల
పారుః సూర్యుడు అగ్ని
పారుష్యం కాఠిన్యము దయమాలి
యు డుట ని ద అవమానము
హి స
పార్థ యుధిష్ఠిరుడు భీముడు అర్జునుడు
(అరునునికి ప్రసిదము)
పార్థసారథిః కృష్ణుడు
పారక్యం వేఱగుట
పార్థివ వి భూమికి స బ ధించిన
భూపాలనచేయ వః భూతలవాస
రాజు
పార్వణ వి పర్వమునకు ు బ ధించి
నది ణ ఎ దప్రదానము
పార్వతి వి పర్వతస బ ధ మైనది
క్కలు ర్శ్వ పర్శువుల సమూ
హము
పార్శ్వతన్ అ చె త ప్రక్కనే
పార్షద్ సీ సభ
పార్షదః సభ్యుడు భటుడు(దేవతలకు)
పార్షద్యః సభ్యుడు
పార్ష్ణిః పు సీ కాలిమడమ వెనుక
పాలః పాలకః రక్షకుడు రాజు
పాలన రక్షణము
పాలయితృ పు రక్షకుడు
పాలాశ వి మోదుగ చెట్టుకుస బ ధి
చినది మోదుగ కొయ్యతో చేయ
బడినది
పాలిః లీ సీ అ చు గుర్తు చెవి
తమ్మె హద్దు పంక్తి మచ్చ బడి
కొలను
పాలిత వి కాపాడబడినది
పావకః అగ్ని సూర్యుడు చిత్రమూ
లము
పావకిః కుమారస్వామి
పావన వి పవిత్రము చేయునది
పాశః –శక త్రాడు వల పాచిక
పాశిన్ పు వరుణుడు యముడు వ్యా
ధుడు
పాశుపత వి శివునకుస బ ధి చినది
శివు డరునున కిచ్చిన యస్త్ర
విశేషము
పాశుపాల్య ఆవులు గేదెలను పోషిం
చువృత్తి

పాశ్చాత్యః వరుణుడు పడమటివాడు వెనుకటివాడు
పాశ్యా త్రాళ్లసమూహము, వల
పాషండః పాషండకః పాషండిన్ వేదబాహ్యుడు

పి

పికః కోకిల
పికబంధుః మామిడిచెట్టు
పికవర్ధనః కాకి
పింగః గోరోజనపురంగు
పింగదృష్టిః సింహము
పింగలః ఒక సంవత్సరము గోరోజన పురంగు అగ్ని కోతి,గుడ్లగూబ, పాము సూర్యానుచరుడు కుబేరుని నిధులలో నొకటి, ఛందఃశాస్త్ర కర్త -లం ఇత్తడి -లా దక్షిణ దిశయందలి ఆడేనుగు
పిష్టపశుః యజ్ఞమునకై పిండితో చేయ బడిన పశువు
పిహిత వి కప్పబడినది

పీ

పీ 4ఆ (పీయతే) త్రాగుట
పీఠం ఆసనము పీట
పీఠికా గ్రంథమునకు మొదట వ్రాయు విషయము
పీఠీ పీట
పీడ్ 10ఉ (పీడయతి -తే పీడిత) బాధించు గాయపఱచు పీడించు వ్యతిరేకించు పిండు వాశము చేయు
పీడనం పీడించుట కష్టములు కలిగిం చుట పరులవలన బాధ పిండుట, నొక్కుట పిండిచేయుట
పీడా బాధ, కష్టము వేదన ఉప ద్రవము గాయము హాని నష్టము పాడుచేయుట అతిక్రమణము ప్రతిబంధము దయ గ్రహణము శిరమున ధరించు మాల
పీడిత వి పీడింపబడినది ఉల్లంఘించ బడినది బాధించబడినది
పీత వి త్రాగబడినది పచ్చనిది -తః పసుపురంగు పుష్యరాగము -తా పసుపు
పీతల వి పసుపు వర్ణము కలది - లః పసుపు రంగు -లం ఇత్తడి
పీన వి బలిసిన లావైన అధికమైన. -నా నిండు పొదుగుకల ఆవు
పీనవక్షస్ వి బలిసిన యురము కల వాడు
పీనసః పడిసెము
పీయూషః -షం అమృతము, పాలు జున్ను పాలు
పీలుః బాణము పరమాణువు కీటము, ఏనుగు తాటిచెక్క, ఒక పూవు, చెట్టు

పిశున్ వి ఖలిసిన లావైన బలవంతు
డైన -పు గాలి
పీవర వి బలిసిన లావైన -రః
తాబేలు రీ యువతి ఆవు

పు

పుంశ్చలీ వ్యభిచారిణి
పుంస్ పు పురుషుడు
పుంస్త్వం పురుషత్వము
పుంవత్ అ పురుషునివలె పుంలింగ
రూపమువలె
పుంఖః -ఖం బాణమ్ముయొక్క ఈకలు
కల భాగము.
పుంఖిత వి ఈకలు కట్టబడినది
పుంగవః వి శ్రేష్ఠుడు పు ఎద్దు
పుచ్ఛః పుచ్ఛ తోక వెనుకతోక
వెనుకభాగము.
పుంజః, జీః సీ రాశి ప్రోవు
పుంజిత వి ప్రోవు చేయబడినది
పుటః టం -టకం మడత చేతి
గుంట పూలబుట్ట దొప్ప మూత
పుటపాకః ఔషధము చేయుటకై
మూలద్రవ్యమును సంగ్రహించి
ఆకు దొన్నెలో కప్పు మట్టిపూసి
అగ్నిచే కాల్చు ప్రక్రియ
పుటభేదన పట్టణము
పుటికా యాలుకలు
పుండరీక తామరపూవు తెల్లతామర
పూవు తెల్లగొడుగు,-కః తెలుపు
రంగు ఆగ్నేయదిశయందు దు
ఏనుగు పులి పాము
పుండరీకాక్షః విష్ణువు
పుండ్రః ఒక విధపు చెఱకు గడ
(ఎఱుపు రంగుకలది) తామర
తెల్లతామర నుదుటధరించు సాంప్ర
దాయిక తిలకము పురుగు
పుండ్రకః ఒక రకపు చెఱకుగడ
(ఎఱ్ఱనిది) నుదుటదాల్చు సాంప్ర
దాయిక తిలకము
పుణ్య వి పవిత్రము మంగళకరము
భాగ్యశాలి అంగీకార్యము మధు
రమ్ము,-ణ్యం ధార్మికము లేదా
నైతికమగు గుణమ్ము, సుకృతము
పుణ్యజనః రాక్షసుడు యక్షుడు
పుణ్యాత్ముడగు మనుజుడు
పుణ్యభూమి ఆర్యావర్తము
పుణ్యలోకః స్వర్గము
పుణ్యవత్ వి సుకృతి సత్కార్యము
చేయువాడు భాగ్యశాలి ధన్యుడు
పుణ్యశ్లోకః పలుమార్లు కీర్తించబడిన
వాడు
పుణ్యస్త్రీ భర్తగల యాడుది శీలవతి
యగు ఇల్లాలు
పుణ్యాహ శుభదినము
పుత్ న పుత్రులులేనివాడు పడవేయ
బడునటి యొక్క నరకభాగము

పుత్తలః పుత్తలీ పుత్తలికా బొమ్మ
పుత్రికా తేనెటీగ చెదపురుగు
పుత్రః కుమారుడు -త్రకః చిన్న ఎల్లవాడు
పుత్రకామేష్టిః పుత్రేష్టిః పుత్రులు కలుగుటకై చేయు యాగము
పుత్రకా -త్రికా కూతురు బొమ్మ
పుత్రిన్ వి కుమారులు కలవాడు
పుత్రీ కూతురు
పుత్రీయా పుత్రులు కావలయు నను కోరిక
పుత్రేషణా పుత్రులకై కోరిక
పునః పునర్ అ మాటిమాటికి
పునర్ మరల
పునర్నవః గోరు
పునర్భవ వి మరల పుట్టినది -వః గోరు సంసారము -వా చంద్రకళ
పునర్భూః రెండవ పెండ్లి చేసికొనిన యాడుది
పునర్వసుః ఒక నక్షత్రము విష్ణువు శివుడు[1]
పునశ్చరణం మంత్రమును మాటి మాటికి పఠించుట
పునస్సంస్కారః రెండవమారు చేయ బడిన ఉపనయనాది సంస్కారము
పునీత వి పవిత్రుడు
పున్నాగః సురపొన్న
పుర్ సీ (పూః) పట్టణము, కోట గోడ శరీరము, బుద్ధి
పురం నగరము కోట ఇల్లు శరీరము, అంతఃపురము
పురతస్ అ ఎదుట
పురద్వారం గోపురము
పురందరః ఇంద్రుడు
పురంధ్రిః -ధ్రీ కుటుంబమున పెద్దతి యగు స్త్రీ కుటుంబిని
పురశ్చరణం కార్యారంభమున చేయు వైదిక క్రియ హోమము చేయుచు మాటిమాటికి దేవతానామము నుచ్చ రించుట
పురస్ అ ముందు ఎదుట తూర్పున
పురస్కారః సన్మానము, వెంట బెట్టు కొనుట ముందిడుకొనుట ఎదు ర్కొనుట
పురస్కృత వి ముందిడబడినది; ఆదరింపబడినది
పురస్కృతిః, పురస్క్రియా ముందిడు కొనుట ఆదరము
పురస్తాత్ అ ముందు ఎదుట ప్రారం భమున తూర్పున
పురస్సరః ముందు పోవువాడు
పురహరః శివుడు
పురా అ పూర్వము, వెనుక తొలుత
పురాణ వి పురాతనము -ణం పూర్వ వృత్తము బ్రాహ్మము మున్నగు పురాణము
పురాతన వి ప్రాచీనము
పురావృత్తం ఇతిహాసము

పురీ పట్టణము.
పురీతత్ పు న ఒక పేగు ఒక నాడి
పురీషం మలము
పురు వి అధికము రుః పుహ్వాది స్వరము చంద్రవంశపు రాజు
పురుషః మనుజుడు పురుషుడు పరమాత్మ జీవుడు
పురుషకారః పురుషప్రయత్నము
పురుషతా - త్వం పురుషశక్తి
పురుషాయిత వి పురుషునివలె వ్యవహరించునది - తం ఉపరతి
పురుషార్థః పురుషుడు సాధింపవలసినది (ఇవి నాలుగు - ధర్మార్థ కామ మోక్షములు)
పురుషోత్తమః విష్ణువు శివుడు వి. పురుషశ్రేష్ఠుడు
పురుహూతః దేవేంద్రుడు
పురోగ - గమ - గామిన్ వి ముందు నడచువాడు
పురోడాశః యజ్ఞమునకొఱకు చేయబడిన వంటకము
పురోధస్ పు పురోహితుడు
పురోభాగిన్ వి దోషములను మాత్రమే వెదకువాడు
పురోహిత ఇ టిపు జార వైదిక కర్మలను నిర్వహించువాడు
పులకః గగుర్పాటు రత్నము రత్నదోషము ఏనుగుకు పెట్టు ఆహారపు ముద
పులాకః అన్నపు మెతుకు గంజి
పులినః న ఇసుకతిన్నె నదీతీరము
పులినవతీ నది
పుళిందః బోయవాడు మ్లేచ్ఛుడు
పులోమజా ఇ ంద్రునిభార్య (శచీదేవి)
పులోమజిత్ పు ఇంద్రుడు
పుల్కసః బోయవాడు మాలవాడు
పుష్ 4 9 ప (పోషతి పుష్యతి, పుష్ణాతి పుష్ట) పోషించుట పెంచుట
పుష్కరం నల్లకలువ ఏనుగు తొండము చివర చర్మవాద్యపు డోలు కత్తి వాదర బాణము, ఆకాశము నీరు యుద్ధము కలయిక రః కొలను సర్పవిశేషము భేరీవిశేషము సూర్యుడు
పుష్కరాహ్వః బెగురుపక్షి
పుష్కరిణీ కోనేరు తామరకొలను ఆడేనుగు
పుష్కల వి అధికమైన సమృద్ధమైన పరిపూర్ణమైన ఉత్తమమైన లః ఒక వాద్యము
పుష్ట వి పోషింపబడినది బలిసినది పెంచబడినది సమృద్ధమైనది పరిపూర్ణమైనది

పుష్టిః సీ పోషణము, సమృద్ధి బలి యుట సంపద
పుష్ప్ 4 ప (పుష్ప్యతి పుష్పిత) వికసించు తెలుచుకొను
పుష్పం పూవు స్త్రీరజస్సు నేత్ర రోగము కుబేరుని విమానము
పుష్పకం పూవు కుబేరుని విమానము నేత్రరోగము
పుష్పకాలః -సమయః వసంతఋతువు
పుష్పకేతనః - కేతుః - చాపః మన్మథుడు
పుష్పదంతః వాయవ్యదిశయందలి యేనుగు శివ పరిచారకుడు
పుష్పద్రవః - నిర్యాసః - రసః మకరందము
పుష్పధనుః -ధన్వన్ పు మన్మథుడు
పుష్పబాణః మన్మథుడు
పుష్పమాసః చైత్రమాసము
పుష్పరజస్ న పుప్పొడి
పుష్పలావికా - లావీ పూలు కట్టి అమ్ము ఆడుది
పుష్పలిట్ః -లిహ్ పు తుమ్మెద
పుష్పవతీ రజస్వల
పుష్పవంతౌ సూర్యచంద్రులు
పుష్పవాటికా పూఁదోట
పుష్పశరః మన్మథుడు
పుష్పసమయః వసంతఋతువు
పుష్పసారః మకరందము
పుష్పిణీ ముట్టుది
పుష్పిత వి పూచినది.
పుష్యః పుష్యమాసము పుష్యమి నక్షత్రము
పుష్యరాగః మణివిశేషము
పుస్తం పుస్తకము చిత్రకారులు శిల్పులు చేయుపని
పుస్తకం పుస్తీ పుస్తకము

పూ

పూ 1,4ఆ 9 ఉ (పవతే, పూయతే, పునాతి -పునీతే, పూత)పవిత్రము చేయు శుభ్రముచేయు
పూగః సమూహము గుత్తి పోకచెట్టు, -గం వక్క
పూగీఫలం వక్క
పూజ్ 10 ఉ (పూజయతి -తే పూజిత) గౌరవించు ఆదరించు
పూజక వి గౌరవించువాడుః పూజించువాడు
పూజనం -జా పూజ ఆదరణము
పూజిత వి పూజింపబడినవాడు ఆదరింపబడినవాడు
పూజ్య వి పూజనీయుడు -జ్యః మామ
పూత వి పవిత్రమైనది వడపోయబడినది -తం సత్యము
పూతిగంధః -ధిః దుర్గంధము
పూయం చీము, జాదము

పూర్ సీ పట్టణము
పూర్ 4 ఆ (పూర్యతే పూర్ణ) ని పుట సంతోషపెట్టుట
పూర్ 10 ఉ (పూరయతి తే) పూరిత) నిండు గాలితో నింపు, తృప్తిపఱచు పటిష్ఠము చేయు.
పూరః ని పుట తృప్తినొందించుట సంతోషపెట్టుట
పూరక వి నింపునది పూరించునది తృప్తి నొందించునది -ణ నింపుట
పూర్ణ వి నిండినది సమాప్తమైనది కడచినది
పూర్ణిమా పూర్ణిమాసీ పూర్ణిమ
పూర్త వి పూర్ణమైనది కప్పబడినది రక్షింపబడినది ర్తం తృప్తి పఱచుట బహుమతి చెఱువులు త్రవ్వించుట మున్నగు లోకోపకార కృత్యము
పూర్తిః ని పుట పూర్తిచేయుట నెఱవేర్చుట
పూర్వ వి మొదటి ముందున్న తూర్పున నున్నవాడు వెనుకటి వాడు -కాయః పశువులకు శరీరపు ముందు భాగము మనుజులకు శరీరపు పై భాగము రాత్ర రాత్రి ముందుభాగము
పూర్వజ వి మొదట పుట్టినది -జః అన్న జా అక్క

పూర్వతస్ అ మొదట తూర్పున
పూర్వత్ర అ ము మదానిలో
పూర్వదేవః రాక్షసుడు
పూర్వపక్షః శుక్లపక్షము వాదము
పూర్వపర్వతః తూర్పుకొండ
పూర్వరంగః నాటకపు మొదలు
పూర్వవత్ అ తొల్లింటివలె వెనుకటి వలె
పూర్వా తూర్పు
పూర్వాహ్ణః పగటి మొదటి సగము
పూర్వేద్యుస్ అ ముందురోజు నిన్న ఆరోజు గడచిన భాగము నందు
పూర్వోత్తరః ముందు వెనుకలు
పూర్వోత్తరా ఈశాన్యదిగ్భాగము
పూషన్ పు సూర్యుడు

పృ

పృ 6 ఆ (ప్రియతే పృత) కార్యనిమగ్నుడగుట ఉచు నిలుపు
పృ 3 ప (పపర్తి పూర్ణ) తెచ్చు బయటకు తెచ్చు ని పు కాపాడు నిలుపు
పృ 10 ఉ (పారయతి తే) అవ్వలి దరి చేరు నిర్వహించు పడాలు కాపాడు
పృక్త వి కలసిన కూడిన తాకబడిన క్తం ఆస్తి సంపద

పృక్తిః సీ తాకిడి సంబంధము
పృక్థం ఆస్తి నిలువ సంపద
పృచ్ 2ఆ (పృక్తే పృక్ణ) కలియు తాకు
పృచ్ 7 ప (పృణాతి పృక్తః) కలియు తాకు తృప్తిపఱచు పెంచు
పృచ్ఛకః అడుగువాడు
పృచ్ఛనం పృచ్ఛా అడుగుట
పృతనా సేన
పృతనాషాహ్ (ట్) పు ఇంద్రుడు
పృథక్ అ వేఱు వేఱువిధముగా
పృథా కుంతి
పృథివీ భూమి –పతిః రాజు యముడు
పృథు వి విశాలమైనది గొప్పది అపారమైన తెలివికలం – థుః అగ్ని ఒక రాజు
పృథుకః –కం అటుకులు
పృథుల వి విశాలమైన
పృథ్వీ భూమి
పృథ్వీకా పెద్దయేలకులు
పృదాకుః తేలు పులి పాము చెట్టు చిఱుతపులి
పృశ్ని వి పొట్టి చిన్న సున్నితమైన బలహీనమైన – శ్నిః కాంతి కిరణము భూమి చుక్కలతో కూడిన ఆకాశము దేవకీదేవి
పృషత్ న నీటిబొట్టు పు దుప్పి
పృషతః దుప్పి నీటిబొట్టు
పృషత్కః బాణము
పృషోదరః గాలి
పృషదంశకః పిల్లి
పృషదశ్వః వాయువు
పృషదాజ్యం పెరుగు కలిసిన నెయ్యి
పృష్ట వి అడుగబడినది చల్లబడినది
పృష్టిః సీ ప్రశ్న తాకుడు కిరణము.
పృష్ఠం ముడ్డి వీపు వెనుకభాగము
పృష్ఠాస్థి వెన్నెముక

## పౄ

పౄ 3 9 ప (పిపర్తి పృణాతిః పూర్ణ) నింపు పూరించు సమాప్తి చేయు తృప్తిపఱచు

## పే

పేటికా పేటి చిన్నసంచి బుట్ట
పేయ వి త్రాగదగినది – యం పానీయము
పేలవ వి మృదువైనది సుకుమారమైనది పలుచనిది
పేశల వి మృదువైనది పలుచనిది, సుందరమైనది
పేశిః – శీ సీ మాంసఖండము, గ్రుడ్డు కండరము పూమొగ్గ వజ్రాయుధము
పేషః – షణం పిండిచేయుట
పేషణిః సీ పేషణి సన్నెకల్లు, నూరెడురాయి

## పై

పైతర వి కు దయందు పండబడిన ఎండివంట
పైతామహ వి పితామహునకు సంబంధించినది
పైతృక వి పితృసంబంధమైనది
పైతృష్వస్రీయః పైతృష్వసేయః మేనత్తకొడుకు
పైత్త వి పిత్తమువలన కలిగిన వ్యాధి
పైత్ర వి ఎతరులకు లేక త్రికి ప బంధి చినది
పైశునం పైశున్యం కొండెములు చెప్పుట చాడీలు
పైష్టికం పి డితో చేయబడిన అట్టు

## పో

పోటః ఇంటి పునాది
పోటా మీసము కల యాడుది
పోట్టలికా పోట్టలీ పొట్లము
పోతః ఎల్ల గున్నయేనుగు
పోతకః ఎల్ల మొక్క
పోత్ర ప దిమూతి నాగటికొన నావ వజ్రాయుధము
పోత్రిన్ పు ప ది
పోలికా పోలీ రొట్టె
పోషః షణం పోషించుట నిర్వహణ, పెరుగుదల సమృద్ధి
పోష్య వి పోషింపతగినవాడు

## పౌ

పౌత్ర వి పుత్రునకుసంబంధించినది త్రః మనుమడు త్రీ మనుమరాలు
పౌనఃపున్యం మాటిమాటికి వచ్చుట లేక జరుగుట
పౌనరుక్త్యః చెప్పినదే చెప్పుట
పౌర వి పురసంబంధమైనది రః నగరవాస -రా గనా పట్టణస్త్రీ
రవృద్ధః నగరవాసయగు ముదుసలి
పౌరస్త్య వి తూర్పు దిక్కునకు సంబంధించినది మొదటిది
పౌరాణ వి పురాణములకు సంబంధించినది, ప్రాచీనమైనది
పౌరాణిక వి పురాణములకు సంబంధించినది గతమునకు సంబంధించినది — కః పురాణము చక్కగా చదివినవాడు
పౌరుష వి మనుష్యసంబంధమైనది -షం పురుషత్వము పరాక్రమము
పౌరుషేయ వి మనుష్యకృతమైనది
పౌరోగవః రాజు వంటశాలకు అధికారి
పౌరోభాగ్య దోషములు పరిశీలించుట అసూయ
పౌరోహిత్య పురోహితుని వృత్తి
పౌర్ణమాసీ పౌర్ణమీ పున్నమి
పౌర్వాపర్యం ముందువెనుకల వరుసక్రమము
పౌలస్త్యః రావణుడు కుబేరుడు

పౌలోమీ శచీదేవి
పౌషః పుష్యమాసము
పౌషీ పుష్యమాసపు పూర్ణిమ.
పౌష్కల్యం సమృద్ధి
పౌష్పం పుష్పసంబంధమైనది

## ప్ర

ప్రకట వి స్పష్టము ప్రసిద్ధము -టం అ స్పష్టముగా
ప్రకటనం వెల్లడిచేయుట
ప్రకటిత వి వెల్లడిచేయబడినది
ప్రకంపః వణకు
ప్రకంపనః పెనుగాలి
ప్రకరః సమూహము
ప్రకరణం విషయము విభాగము సందర్భము అవకాశము
ప్రకర్షః గొప్పదనము శక్తి
ప్రకల్పనా ఉత్పాదనచేయుట
ప్రకాండః -డం చెట్టుబోదె పెనుకొమ్మ
ప్రకామ వి అధికమైనది -మః కోరిక -మం అ మిక్కిలి అధికముగా, చాలినంతగా యథేచ్ఛగా
ప్రకారః పద్ధతి
ప్రకాశ వి ప్రకాశించు స్పష్టమగు, అగపడు -శః వెలుగు, సూర్య ప్రకాశము కీర్తి
ప్రకాశకః ప్రకాశింపజేయువాడు
ప్రకిరణం వెదజల్లుట
ప్రకీర్ణ వెదజల్లబడినది, వ్యాప్తమైనది
ప్రకీర్ణకం వింజామరము -కః గుఱ్ఱము
ప్రకీర్తనం వెల్లడించుట మెచ్చుకోలు
ప్రకృత వి మొదలుపెట్టబడినది చక్కగా చేయబడినది అప్పటికి సంబంధించినది ముఖ్యమైనది -తం మూలవిషయము అప్పటికి సంబంధించినది
ప్రకృతిః సీ శబ్దపు మూలరూపము (ప్రత్యయము చేరక ముందురూపము) స్వభావము తొలిరూపు
ప్రకృతిసిద్ధ వి సహజముగనే సిద్ధించినది
ప్రకృష్ట వి గొప్పది
ప్రకోష్ఠః ముంజేయి
ప్రక్రమః ప్రారంభము
ప్రక్రాంత వి ప్రారంభించబడినది
ప్రక్రియా పద్ధతి నిర్వహణము
ప్రక్షాలనం కడుగుట
ప్రక్షిప్త వి విసరివేయబడినది చేర్పబడినది
ప్రక్షీణ వి నశించినది అగపడనిది
ప్రక్షేపః ముందుకు విసరుట వెదజల్లుట లోపల చేర్చుట
ప్రక్షోభణం అలజడి చేయుట
ప్రఖ్య వి స్పష్టము దర్శనీయము పోలినది
ప్రఖ్యా మిక్కిలి ప్రసిద్ధి పోలిక
ప్రఖ్యాత వి మిగుల ప్రసిద్ధమైనది

ప్రఖ్యాతిః స్త్రీ కీర్తి పొగడ్త
ప్రగత వి పోయినది పూర్తిగా పోయినది
ప్రగల్భ వి ప్రతిభ కలవాడు ధైర్యశాలి సద్యఃస్ఫూర్తి కలవాడు
ప్రగాఢ వి అధికము దృఢము మునిగినది కఠినమైనది - ఢం మిక్కిలి అధికముగా
ప్రగుణ వి తిన్ననిది ఋజువైనది తగినది గుణములు కలిగినది చాతుర్యము కలది
ప్రగృహీత వి పొందబడినది పట్టుకొనబడినది
ప్రగే అ ప్రాతఃకాలముననే
ప్రగ్రహః వ్యాప చుట పట్టుకొనుట పగము గ్రహణప్రార ధము నియమనము బ ధము పె చుట పటుబడినవాడు త్రాసు త్రాడు కా తికిరణము
ప్రఘణః ప్రఘాణః వాకిలిప్రక్క చిన్నగది ఇనుపగద రాగిబిందె
ప్రఘాతః యుద్ధము హత్య
ప్రచ డ వి తీవ్రమైన ప్రబలమైన భయంకరమైన
ప్రచయః వృది సమూహము ప్రోగు చేయుట
ప్రచారః స చారము క్రమణము వ శాచారము ప్రసిది వ్యవహారము
ప్రచిత వి వృదినొందినది
ప్రచుర వి అధికమైనది
ప్రచోదనం ప్రేరేపించుట ఆదేశించుట నియమించుట
ప్రచ్ఛ కి ప (పృచ్ఛతి పృష్ట) అడుగుట వెదకుట
ప్రచ్ఛదః ఆచ్ఛాదన కప్పు
ప్రచ్ఛన్న వి కప్పబడినది
ప్రచ్ఛాదన ఉత్తరీయము
ప్రచ్ఛాదిత వి మూయబడినది కప్పబడినది
ప్రచ్ఛాయ దట్టమైన నీడ
ప్రజనః పుట్టించుట గర్భాధానము చేయుట
ప్రజననం గర్భాధానము పుటించుట పుట్టుక వీర్యము
ప్రజవిన్ వి వేగముగ పోవువాడు
ప్రజా సంతతి జనము
ప్రజాగరః రాత్రి నిద్రలేమి జాగరూకత
ప్రజాత వి పుట్టినవాడు తా బాలెంతరాలు
ప్రజావత్ వి స తానముకలది గర్భవతి-స్త్రీ వదిన సోదరునిభార్య
ప్రజ్ఞ వి ప డితుడు
ప్రజ్ఞా మేధ బుది వివేకము
ప్రజ్ఞాన బుది గురుతు
ప్రడీనం ఎగురుట

ప్రణతిః సీ నమస్కారము
ప్రణయః ప్రేమ వినయము అను రాగము ఇచ్ఛ సౌజన్యము
ప్రణయనం తెచ్చుట కొనిపోవుట అనుష్ఠించుట రచించుట
ప్రణవః ఓంకారము
ప్రణాదః కలకలధ్వని
ప్రణామః నమస్కారము
ప్రణాలః - లీ - లికా కాలువ నీరు పోవు దారి
ప్రణాశః నాశము
ప్రణిధానం ప్రయోగించుట, ఉపయోగము శక్తి
ప్రణిధిః వేగులవాడు
ప్రణిపతనం - పాతః సాష్టాంగ పాత ముగ నమస్కరించుట
ప్రణిత వి ఉంచబడినది చేర్చ బడినది వ్యాప్తమైనది, నిశ్చితమై నది
ప్రణీత వి చెంతకు తేబడినది, ఈయ బడినది వ్రాయబడినది నేర్పబ డినది -తః మంత్రములచే సం స్కరించబడిన యాగాగ్ని
ప్రణుత వి మిక్కిలి పొగడబడినది
ప్రణేతృ పు రచయిత నిర్మాత వ్యాఖ్యాత
ప్రణేయ వి శిక్షింపదగినవాడు
ప్రతతిః సీ విస్తారము వ్యాప్తి తీగ

ప్రతప్త వి మిక్కిలి వేడెక్కినది.
ప్రతానః తీగె తీగెల మొలక చిలవ
ప్రతాపః వేడిమి కాంతి పరాక్రమము బలము
ప్రతారః బాటించువాడు మోసము
ప్రతారకః మోసగాడు
ప్రతారణం దాటించుట మోసగిం చుట మోసము
ప్రతికర్మన్ న వస్త్రములు నలంకరిం చుకొనుట
ప్రతి(తీ)కారః బదులు తీర్చుట మారుచేత
ప్రతి(తీ)కాశః పోలిక
ప్రతికూల వి విరుద్ధము అనుకూ లము కానిది
ప్రతికృతిః ప్రతిమ మారుచేత
ప్రతిక్రియా ప్రతీకారము
ప్రతిక్షేపః విరోధించుట తిరస్కరిం చుట
ప్రఖ్యాతిః ప్రసిద్ధి
ప్రతిగృహీతృ వి స్వీకరించువాడు. దానము తీసికొనువాడు
ప్రతిగ్రహః స్వీకరించుట దానము పాణిగ్రహణము సేనయొక్క వెనుక భాగము
ప్రతిఘః విరోధము కోపము
ప్రతిఘటనం ఎదురుతిరుగుట, ఎదురు దెబ్బ తీయుట

ప్రతిఘాతః ఎదురుదెబ్బతీయుట, ప్రతి క్రియ
ప్రతిఘాతనం ప్రతీకారము చంపుట
ప్రతిచికీర్షా ప్రతీకారేచ్ఛ
ప్రతిచ్ఛందః –దకః పోలిక సామ్యము ప్రతిబింబము ప్రతినిధి
ప్రతిచ్ఛన్న వి కప్పుకొనబడిన దాగిన
ప్రతిచ్ఛాయా ప్రతిబింబము
ప్రతిజాగరః ఎచ్చరిక
ప్రతిజ్ఞా అంగీకారము శపథము
ప్రతిజ్ఞాత వి అంగీకరించబడినది
ప్రతిజ్ఞానం అంగీకారము
ప్రతిదానం తిరిగి యిచ్చుట
ప్రతిదిన దినదినము
ప్రతిద్వంద్విన్ పు శత్రువు
ప్రతిధ్వనిః – ధ్వానః మాఱుమోత
ప్రతినిధిః బదులుగా నుండువాడు
ప్రతినిర్యాతనం తిరిగి యిచ్చుట బదులు తీర్చుట
ప్రతినివిష్ట వి పట్టుపట్టబడినది
ప్రతినివేశః పట్టుదల
ప్రతిపక్షః అవ్వలి పక్షమువాడు శత్రువు
ప్రతిపత్తిః తెలివి గౌరవము ప్రారంభము ప్రాప్తి నిర్వహణము నిశ్చయము పదవి ఉపయోగము కీర్తి ధైర్యము

ప్రతిపద్ స్త్రీ ప్రవేశము మార్గము ప్రారంభము తెలివి పాడ్యమి
ప్రతిపదా – దీ పాడ్యమి
ప్రతిపన్న వి పొందబడినది సంపాదించబడినది అంగీకరించబడినది
ప్రతిపాదక వి ఇచ్చునది కలిగించునది వివరించునది
ప్రతిపాదనం ఇచ్చుట వివరించుట నిర్వహించుట అభ్యాసము ప్రారంభము
ప్రతిపాలకః రక్షకుడు
ప్రతిపాలనం కాపాడుట
ప్రతిపూజనం – నా ఆదరము గౌరవము
ప్రతిప్రణామః తిరిగి నమస్కరించుట
ప్రతిప్రదానం తిరిగి ఇచ్చివేయుట
ప్రతిప్రయాణం మఱలిపోవుట
ప్రతిప్రశ్నః ఎదురుప్రశ్న సమాధానము
ప్రతిప్రహారః ఎదురుదెబ్బ
ప్రతిఫలనం ప్రతిబింబించుట
ప్రతిబద్ధ వి కటివేయబడినవాడు అడ్డుకొనబడినవాడు తృప్తుడు
ప్రతిబంధః అడ్డుపాటు అనివార్య సంబంధము
ప్రతిబంధక వి నిరోధించునది అడ్డుపడునది
ప్రతిబంధనం అడగించుట

ప్రతిబంధిః - ధీ (దీ) ఆక్షేపము
ప్రతిబింబః ప్రతిఫలనము - బనం ప్రతి ఫలించుట పోలిక
ప్రతిబింబిత వి ప్రతిఫలించినది
ప్రతిబుద్ధ వి మేల్కొనినవాడు ప్రేరితుడు పరిశీలింపబడినది తెలిసికొనబడినది
ప్రతిబోధః మేల్కొనుట జ్ఞానము అధ్యయనము కారణము
ప్రతిబోధిత వి మేల్కొలుపబడినవాడు
ప్రతిభటః శత్రువు
ప్రతిభా కాంతి విజ్ఞత అవగతి, స్ఫురణము
ప్రతిభాత వి తెలియబడినది
ప్రతిభానం ప్రతిభ తేజస్సు స్ఫూర్తి
ప్రతిభాసః - సనం అకస్మాత్తుగా మనస్సులో భాసించుట సమయస్ఫూర్తి
ప్రతిభూః పూటకాపు
ప్రతిమా పోలిక బింబము మూర్తి బొమ్మ
ప్రతిమానం బొమ్మ పోలిక ప్రతికృతి
ప్రతిముక్త వి కట్టబడినది విడువబడినది, ధరించబడినది
ప్రతియత్నః ప్రయత్నము చక్కబఱచుట కోరిక అనుకూల్యము,
ప్రతియాతనం - నా బదులుతీర్చుట
ప్రతియానం తిరుగుప్రయాణము
ప్రతియోగః విరోధము, విరుగుడు

ప్రతియోగిన్ వి విరోధించువాడు అడ్డుకొనువాడు
ప్రతియోద్ధృ పు -ధకః శత్రువు
ప్రతిరోధః అడ్డపాటు, దొంగతనము
ప్రతిరోధకః - ధిన్ అడ్డగించువాడు
ప్రతివచనం ప్రతివాక్యం బదులు చెప్పుట
ప్రతివాదః బదులుచెప్పుట తిరస్కరించుట
ప్రతివాదిన్ పు శత్రువు వ్యతిరేకివాదికి ప్రతిపక్షమువాడు
ప్రతివిధానం మారుసేత ప్రతిక్రియ
ప్రతివేశః పొరుగువాడు పొరుగిల్లు
ప్రతివేశిన్ వి పొరుగువాడు
ప్రతిశాపః శాపమునకు మారుశాపము
ప్రతిశ్యా - శ్యాన - శ్యాయః పడిసెము
ప్రతిశ్రయః ఇల్లు, సభ యాగశాల సహాయము
ప్రతిశ్రవః వాగ్దానము ప్రతిజ్ఞ
ప్రతిషిద్ధ వి నిషేధింపబడినది తిరస్కరింపబడినది
ప్రతిషేధః నిషేధము త్రోసిపుచ్చుట
ప్రతిషేధక వి నిరోధించువాడు
ప్రతిష్టంభః అడ్డు
ప్రతిష్ఠా స్థితి, ఉనికి ఇల్లు నిలుకడ ఆధారము గౌరవము కీర్తి
ప్రతిష్ఠిత వి స్థిరముగ స్థాపించబడినది

ప్రతిసందేశః వా ర్తకు బదులువా ర్త పుట
ప్రతిసంధానం కలుపుట అతుకుట
ప్రతిసంధిః మరల కలియుట గర్భ మున ప్రవేశించుట నిలుపుదల విరామము
ప్రతిహత వి అడ్డగింపబడినది.
ప్రతిహతిః స్త్రీ. అడు విఘాతము.
ప్రతిహారః ద్వారపాలకుడు.
ప్రతిహారకః ఇంద్రజాలికుడు
ప్రతిహింసనం-సా పగతీర్చుకొనుట
ప్రతీక వి. ప్రతికూలము విరుద్ధము, -కః అవయవము, -క ప్రతిమ, ముఖము, అగ్రభాగము
ప్రతీకారః ప్రతీకా ఎదురుమాటలు;
ప్రతీకాశః ప్రతిక్రియ బదులు తీర్చు ట అగ్రభాగము
ప్రతీక్ష్య వి. పూజ్యుడు.
ప్రతీచీ స్త్రీ పశ్చిమదిక్కు.
ప్రతీచీన వి పశ్చిమ దిక్కునకు సం బంధించిన
ప్రతీచ్య వి పశ్చిమదిక్కునందు డు వాడు
ప్రతీత వి పోయినది గడచినది స్వీక రి పబడినది తెలియబడినది ప్రసి ద్ధమైనది స తుమడు చతురుడు
ప్రతీతిః విశ్వాసము జ్ఞానము కీర్తి ఆదరము వ తోషము
ప్రతీప వి విరుద్ధమైనది అప్రియము, విఘ్నకరము పః శంతనుని తం డ్రి శత్రువు పం ఒక అర్థాలం కారము పం అ విరుదముగా - పగ వి ప్రతికూలముగా నడచు నది
ప్రతీపదర్శినీ స్త్రీ
ప్రతీహారః రిన్ పు ద్వారపాలకుడు రీ ద్వారపాలకురాలు
ప్రతోదః ముసకోల
ప్రతోలీః లీ పెదవీధి
ప్రత్న వి ప్రాచీనమైన మొదటి పురాతనమైన
ప్రత్యక్ అ పడమర విరుద్ధముగా
ప్రత్యక్ష వి. ఇంద్రియగోచరము అగపడునట్టి స్పష్టమైనది, -క్షం. ఒక ప్రమాణము.
ప్రత్యగ్ర వి నూతనమైన, శుద్ధమైన
ప్రత్యభిజ్ఞా జ్ఞానం గుర్తింపు.
ప్రత్యభివాదః దనం నమస్కార మునకు బదులు నమస్కారము
ప్రత్యయః అధీనము శపథము జ్ఞానము విశ్వాసము హేతువు
ప్రత్యయిత వి విశ్వాసము కలవాడు
ప్రత్యర్థిన్ వి శత్రువు
ప్రత్యర్పణ తిరిగిఇచ్చుట
ప్రత్యర్పిత వి తిరిగి యిచ్చివేయ బడినది
ప్రత్యవసానం భుజి చుట త్రాగుట
ప్రత్యాఖ్యానం తిరస్కారము

ప్రత్యాదేశః అవమానము
ప్రత్యాశా అడియాస
ప్రత్యాయనం నమ్మకము
ప్రత్యాలీఢం విలుకాడు ఎడమకాలు ముందునకు చాచి నిలచుట
ప్రత్యాసత్తిః సీ దేశకాలకృతమగు సామీప్యము
ప్రత్యాసన్న వి సమీపమందున్న
ప్రత్యాసారః సేన వెనుకభాగము
ప్రత్యాహారః వెనుకకు తీసుకొనుట నిలిపివేయుట జ్ఞానేంద్రియము లను అదుపులో నుంచుట
ప్రత్యుక్తిః ప్రత్యుత్తరము
ప్రత్యుజ్జీవనం తిరిగి బ్రతుకుట
ప్రత్యుత అ పైదుమిక్కిలి
ప్రత్యుత్క్రమః యుద్ధసన్నాహము కార్యారంభము చేయు ప్రథమ ప్రయత్నము
ప్రత్యుత్థానం అతిథుల యెడ ఆదర ముతో ఆసనమునుండి లేచి వారి నాహ్వానించుట
ప్రత్యుద్గతిః, -ద్గమః - ద్గమనం అతి థికి స్వాగతము చెప్పుటకై ఎదు రేగుట
ప్రత్యూషన్ న ప్రాతఃకాలము
ప్రత్యూషః -షం వేకువ
ప్రత్యూహః విఘ్నము అంతరాయము
ప్రథ్ 1ఆ (ప్రథతే, ప్రథితః) పెరు గు వ్యాపించు ప్రసిద్ధమగు అగ పడు
ప్రథనం వ్యాప్తి ప్రదర్శించుట యుద్ధము
ప్రథమ వి మొదటిది ప్రధానమైనది
ప్రథమా పక్షమందలి మొదటితిథి
ప్రథిత వి ప్రసిద్ధమైనది
ప్రదరః బాణము చీల్చుట స్త్రీల రక్తస్రావరూపమగు రోగము
ప్రదర్శక వి చూపువాడు
ప్రదానం ఇచ్చుట బహుమతి
ప్రదాయం బహుమతి
ప్రదిః -దేయః బహుమతి
ప్రదీపః దీపము
ప్రదీపనం ప్రజ్వలింపజేయు - నః ఒక విషము
ప్రదేశః చోటు
ప్రదేశనం చూపుట సూచించుట
ప్రదేశినీ చూపుడువ్రేలు
ప్రదోషః సాయంకాలము
ప్రదోహః పాలు పిదుకుట
ప్రద్యోతనం ప్రకాశింపజేయుట
ప్రద్రావః తప్పించుకొనుట
ప్రధనం యుద్ధము నాశము
ప్రధమనం ఊదుట
ప్రధర్షః - ధర్షణం - ధర్షణా ముట్ట డించుట

ప్రధాన వి ముఖ్యమైనది -నం ముఖ్యుడు పరమాత్మ బుద్ధి

ప్రధూపిత వి పరిమళింపజేయబడిన ప్రజ్వలింపజేయబడిన -తా ఆపదలోనున్న స్త్రీ

ప్రపంచః ప్రదర్శనము విస్తారము వివిధత సంసారము భూలోకము దృశ్యము

ప్రపత్తిః సీ శరణాగతి

ప్రపద పాదముయొక్క ముందుభాగము

ప్రపన్న వి చెంత చేరినవాడు శరణు చొచ్చినవాడు అనుసరించువాడు ప్రపత్తి చేసినవాడు

ప్రపా చలివ దిరి బాటసారులు జలము త్రాగుచోటు - పాలికా బాటసారులకు జలమిచ్చు స్త్రీ

ప్రపాతః పతనము జలప్రవాహము ఒడు తీరము

ప్రపానం త్రాగుట

ప్రపితామహః తండ్రితాత

ప్రపితృవ్యః తండ్రికి పిన (పెద) తండ్రి

ప్రపీడన మిక్కిలి బాధించుట

ప్రపౌత్రః ముమ్మనుమడు

ప్రపౌత్రీ ముమ్మనుమరాలు

ప్రఫుల్ల వి మిక్కిలి వికసించినది సంతోషము కలది

ప్రబంధ పు గ్రంథకర్త

ప్రబంధః బంధము గ్రంథము రచన

ప్రబల వి మిక్కిలి బలవంతుడు

ప్రబుద్ధ వి మేలుకొన్నవాడు బుద్ధిమంతుడు తెలిసినవాడు

ప్రబోధః -ధనం మేల్కొలుపు జాగరూకత తెలివిడి

ప్రభంజనః గాలివాన తుపానుగాలి

ప్రభవః కారణము పుట్టుక పుట్టుచోటు పరాక్రమము

ప్రభవిత్రు పు పాలకుడు అధిపతి

ప్రభవిష్ణు వి బలవంతుడు - ష్ణుః అధిపతి స్వామి విష్ణువు

ప్రభా కాంతి - కరః సూర్యుడు

ప్రభాగః విభాగము.

ప్రభాతం తెల్లవారు సమయము, వేకువ.

ప్రభానం కాంతి, ప్రకాశము

ప్రభావః కాంతి మాహాత్మ్యము శక్తి

ప్రభాసః కాంతి ప్రకాశము

ప్రభుః అధిపతి విష్ణువు పాలకుడు

ప్రభుతా త్వం అధికారము ఆధిపత్యము

ప్రభూత వి అధికమయినది ఉన్నతమైనది

ప్రభూతిః సీ మూలము శక్తి

ప్రభృతిః సీ మొదలు మొదలుకొని

ప్రభేదః విభాగము విధము

ప్రభ్రంశః పతనము

ప్రభ్రంశిత వి పడగొట్టబడినవాడు.

ప్రభ్రష్ట వి పడినవాడు
ప్రమగ్న వి మునిగినవాడు
ప్రమత్త వి ఉన్మత్తుడు
ప్రమథః గుణము
ప్రమథిత వి బాధితుడు - తం చిలికిన పెరుగు
ప్రమద వి త్రాగినవాడు మత్తెక్కినవాడు -దః సంతోషము -వనం (రాణాంతఃపురపు) వనము.
ప్రమదా సుందరి - వనం రాణాంతఃపురపు టుద్యానము
ప్రమనస్ వి ఆనందముకలది
ప్రమా యథార్థజ్ఞానము
ప్రమాణం కొలత తూనిక మొ ప్రత్యక్షము మున్నగు జ్ఞానకారణము శాస్త్రము
ప్రమాదః ఏమఱుపాటు
ప్రమాపణం చంపుట
ప్రమితిః సీ యథార్థజ్ఞానము
ప్రమీత వి చచ్చినది -తః యజ్ఞమున చంపబడిన జంతువు
ప్రమీతిః సీ చావు
ప్రమీలా కునికిపాటు
ప్రమీలిత వి కనులుమూసుకొన్నవాడు.
ప్రముక్త వి విడువబడినది
ప్రముఖ వి ప్రధానమైనది -ఖః ముఖ్యుడు -ఖం నోరు
ప్రముద్ సీ ఆనందము
ప్రముదిత వి ఆనందించినవాడు

ప్రముషిత వి దొంగిలింపబడినది
ప్రమూఢ వి మూర్ఖుడు
ప్రమేయ వి యథార్థముగా తెలిసికొనదగినది
ప్రమోదః ఆనందము
ప్రయతః వి పరిశుద్ధము
ప్రయత్నః మిక్కిలి ప్రయత్నము
ప్రయాగః యజ్ఞము ఇంద్రుడు, గుఱ్ఱము
ప్రయాత వి వెడలినవాడు మరణించినవాడు
ప్రయాణః త్రోవ కష్టము
ప్రయుక్త వి చున్నబడినది, ఉపయోగింపబడినది
ప్రయుతం పది లక్షలు 10 00 000
ప్రయోక్తృ వి ప్రయోగించువాడు
ప్రయోగః నడపుట ఉపయోగము, ప్రదర్శనము అభ్యాసము, ప్రారంభము
ప్రరోహః మొలక
ప్రరోహణం పెరుగుట.
ప్రలపనం మాటలాడుట
ప్రలంబః వ్రేలాడుట,హారము కొమ్మ, స్తనము తరగము సీపము, ఒక రాక్షసుడు
ప్రలంభః మోసము
ప్రలయః నాశము క్షయము.
ప్రలాపః అర్థములేని మాట
ప్రలోభః పేరాస

ప్రలోభనం ఆసజూపుట ఆకర్షించుట
ప్రవక్తృ పు చక్కగ మాటలాడువాడు ఉపాధ్యాయుడు
ప్రవచనం పలుకుట ఉపన్యాసించుట బోధించుట
ప్రవణ వి ఆసక్తి కలవాడు నమ్రుడు సమృద్ధుడు దాటను సన్నద్ధుడు కూడినవాడు ణః చతుష్పథము ణం దిగుడు
ప్రవత్స్యత్ వి ప్రయాణమై పోబోవు నది
ప్రవర్గ్యః పు. మృత్తుపలిక
ప్రవర వి ప్రధానమైన శ్రేష్ఠమైన ర్షులు వంశ క్రమము సంతానము
ప్రవర్తక పు. నడపువాడు ఉత్పత్తి చేయువాడు -కృ నిర్వాహకుడు స్థాపకుడు
ప్రవాచ్ వి బాగుగ మాటలాడువాడు
ప్రవహణ రథము పడవ విమానము
ప్రవాతః పెనుగాలి
ప్రవాదః ఏదేనిమాట పలుకుట ఉపన్యాసము కథ అపవాదు
ప్రవాలః చిగురు పగడము వీణా దండము
ప్రవాసః ఇతరదేశముల దు నివసించుట
ప్రవాసనం దేశాంతరనివాసము చంపుట
ప్రవాసిన్ ప్రయాణికుడు
ప్రవాహః (స ఘటనల) పరపర వెల్లువ మడుగు
ప్రవాహికా అతిసారరోగము
ప్రవిదారణం చీల్చుట యుద్ధము కలవరము
ప్రవిష్ట వి వెడలినవాడు ప్రవేశించినవాడు ప్రారంభించబడినది
ప్రవీణ వి సమర్థుడు కుశలుడు
ప్రవీర వి ఉత్తముడు బలవంతుడు సాహసయోధుడు ప్రధానుడు
ప్రవృత్త వి ప్రారంభించబడినది పైలకొన్నది
ప్రవృత్తి స్త్రీ. ముందడుగు ఉదయము ప్రవాహము ఆచరణము ప్రవర్తన ప్రయోగము వార్త నడవడి మొదలు, చేష్ట
ప్రవృద్ధ వి పూర్ణముగా పెరిగిన వృద్ధినొందిన లోతైన
ప్రవృద్ధిః స్త్రీ పెరుగుదల
ప్రవేక వి ముఖ్యము ఉత్తమము
ప్రవేణిః ణీ జడ విరబోసికొనిన (అలంకరించుకొనిన) కేశములు ఏనుగుపై పఱచు ఎఱ్ఱకంబళి
ప్రవేశ -శనం లోనికి వచ్చుట
ప్రవేష్టః బాహువు, ఏనుగుపై మావటీడు కూర్చుండుభాగము
ప్రవ్యక్త వి స్పష్టమైనది

ప్రవ్రజనం విదేశములకు పోవుట, వెడలగొట్టబడుట వానప్రస్థుడగుట
ప్రవ్రజ్యా సన్యాసము పర్యటనము
ప్రవ్రశ్చనః కట్టెలుకోట్టు కత్తి
ప్రవ్రాజ్, ప్రవ్రాజకః సన్యాసి
ప్రవ్రాజనం దేశమునుండి వెడలగొట్టుట
ప్రశంసనం ప్రశంసా మెచ్చుకొనుట, ప్రశంస స్తోత్రము వర్ణన
ప్రశమః శాంతి విరామము తుది వినాశము
ప్రశమన వి పోగొట్టువాడు, శాంతింపజేయువాడు -నం శాంతింపజేయుట చికిత్సచేయుట పోగొట్టుట విరామము యోగ్యునికిచ్చుట పొందుట
ప్రశస్త వి మెచ్చుకొనబడినదైనది
ప్రశస్తిః స్త్రీ ప్రసిద్ధి
ప్రశాఖ వి పలుకొమ్మలుగలది -శాఖా చిన్నకొమ్మ
ప్రశాంత వి సౌమ్యమైన, మణిగినది మృతినొందినది -తిః స్త్రీ శాంతి, విరామము
ప్రశాసనం పరిపాలనము
ప్రశాస్తృ పు పాలకుడు
ప్రశిష్యః శిష్యుని శిష్యుడు
ప్రశ్నః అడుగుట
ప్రశ్రయః -యణం ఆదరము, సౌజన్యము నమ్రత స్నేహము
ప్రశ్రిత వి వినీతుడు
ప్రశక్తిః స్త్రీ ఆసక్తి అనురక్తి సంబంధము, ధైర్యము
ప్రసంగః ఆసక్తి సంబంధము, అవసరము
ప్రసన్న వి పవిత్రుడు, సంతుష్టుడు దయాళువు
ప్రసభ వి బలము -భం అ బలముతో పట్టుదలతో
ప్రసరః ముందుకు పోవుట విస్తరించుట ప్రవాహము సమూహము యుద్ధము
ప్రసరణం ముందడుగువేయుట పరుగెత్తుట ప్రవహించుట పారిపోవుట సుదూరము వ్యాపించుట శత్రువును చుట్టుముట్టుట
ప్రసవః కనుట పుట్టుట సంతతి, బిడ్డ, పువ్వు పండు -వ‌బంధనం తాడిమ
ప్రసవితృ పు తండ్రి
ప్రసవిత్రీ తల్లి
ప్రసహ్య అ బలాత్కారముగ
ప్రసాదః అనుగ్రహము ప్రసన్నత దయ శాంతి పవిత్రత స్పష్టత, భగవంతునకు నివేదింపబడిన పదార్థము బహుమతి
ప్రసాదక వి పవిత్రము చేయువాడు, సంతోషపెట్టువాడు

ప్రసాధక వి సాధించువాడు పవి త్రము చేయువాడు అలంకరించు వాడు
ప్రసాధన అలంకరించుట
ప్రసాధనీ దువ్వెన
ప్రసాధిత వి అలంకరించబడిన పూర్తిచేయబడిన
ప్రసారః - రక్షణ వ్యాపించుట చాచుట
ప్రసిత వి ఆశక్తకలవాడు తత్పరుడు
ప్రసితిః సీ నిర్బంధము
ప్రసిద్ధ వి విఖ్యాతినొందినవాడు
ప్రసిద్ధిః సీ కీర్తి సఫలత అలం కారము
ప్రసుప్త వి నిదురించినది
ప్రసుప్తిః సీ గాఢనిద్ర
ప్రసూః సీ తల్లి
ప్రసూత వి పుట్టినది - త పూవు తిః సీ కానుపు పుట్టుక బిడ
ప్రసూన పూవు పండు
ప్రసృత వి వ్యాపించినది ముందు నకు పోయినది
ప్రసృతా సీ కాలిపిక్క
ప్రసృతిః సీ ముందుకు పోవుట పాకుట పుడిసలి
ప్రసేకః తడుపుట
ప్రసలన పడుట జారుట
ప్రస్తరః రాయి రత్నము చిగురుటా కులు పూలతో కూర్చిన శయ్య
ప్రస్తరణ - ణా శయ్య
ప్రస్తారః వ్యాప్తి పూలపాన్పు
ప్రస్తావః ప్రస్తావనా ఆరంభము సం దర్భము సమయము ప్రస్తావన భూమిక
ప్రస్తుత వి మెచ్చుకొనబడినది ప్రారంభించబడినది చేయబడినది త చేతిలోనున్న పని
ప్రస్థః - స్థ కొండనెత్తము
ప్రస్థానం బయలుదేరుట ప్రయాణము సిద్ధాంతము
ప్రస్థాపన పంపుట
ప్రస్థాపిత వి పంపబడినవాడు
ప్రస్థిత వి వెడలినవాడు
ప్రస్థితిః సీ ప్రయాణము, బయలు దేరుట
ప్రస్రవ కారుట ప్రవాహము పొదు గును డి పాలు కారుట
ప్రస్రవణ కారుట పొదుగును డి పాలు కారుట జలప్రవాహము నీటి బుగ చెమట ణః ఒకకొం డ
ప్రస్రావః కారుట మూత్రము
ప్రస్వాపః నిద్ర
ప్రస్వేదః అధికమగు చెమట
ప్రహరణ చంపుట
ప్రహత వి చంపబడిన గాయపఱచ బడిన కొట్టబడిన ఓడిం చబడిన, అభ్యసింపబడిన

ప్రహరః దినమందలి యెనిమిదవ భాగము

ప్రహరణం కొట్టుట విసరుట తొలగించుట ఆయుధము యుద్ధము

ప్రహరణీయం ఆయుధము

ప్రహర్తృ వి కొట్టువాడు యోధుడు, విలుకాడు

ప్రహర్షః మహానందము

ప్రహర్షణం మిక్కిలి సంతోషింపజేయుట

ప్రహర్షిణీ పసుపు ఒకవృత్తము

ప్రహసనం బిగ్గఱగా నవ్వుట వేళాకోళము చేయుట పరిహాసము

ప్రహస్తః ప్రేళ్ల దాపిన అఱచేయి

ప్రహాణం త్రోసిపుచ్చుట విడచిపెట్టుట

ప్రహారః దెబ్బ గాయము చంపుట

ప్రహాసః బిగ్గఱగా నవ్వుట గేలి చేయుట

ప్రహిత వి ఉంచబడినది, విస్తరించబడినది పంపబడినది, కొట్టబడినది

ప్రహీణ వి విడువబడినది, త్రోసిపుచ్చబడినది

ప్రహృత వి కొట్టబడినది -తం దెబ్బ

ప్రహృష్ట వి మిక్కిలి సంతోషించినవాడు

ప్రహేలిః -లికా గూఢార్థముకల ఒక కావ్యము

ప్రహ్లాదః మిక్కిలిఆనందము హిరణ్యకశిపుని కుమారుడు

ప్రహ్లాదనం ఆనందపఱచుట

ప్రహ్వ వి నమ్రుడు, ఆసక్తుడు

ప్రాంశు వి ఎత్తైనది -శుః పొడుగువాడు

ప్రాక్ అ ముందు, మొదట

ప్రాకరణిక వి ప్రస్తుతము

ప్రాకామ్యం ఒక ఐశ్వర్యము, ఎదురులేని ఇచ్ఛ

ప్రాకారః ప్రహరి

ప్రాకృత వి ప్రాచీనము సాధారణము అప్రధానము -తః సామాన్యుడు -తం ప్రాకృతభాష

ప్రాకృతిక వి సహజమైనది

ప్రాక్తన వి ప్రాచీనమైనది

ప్రాగల్భ్యం ధైర్యము విశ్వాసము, గర్వము చాతుర్యము

ప్రాగ్రం వి ముఖ్యమైన స్థానము

ప్రాగ్ర్య వి ప్రధానము ఉత్తమము

ప్రాఘాతః యుద్ధము.

ప్రాఘారః కారుట

ప్రాఘుణః,- ణకః -ణికః, ప్రాఘూర్ణకః ప్రాఘూర్ణికః ఆగంతుకుడు అతిథి

ప్రాంగణం ముంగిలి

ప్రాచ్ ప్రాంచ్ వి ముందున్న, తూర్పునందున్న షం తూర్పు దేశమువాడు

ప్రాచీ తూర్పు
ప్రాచీన వి తూర్పున పుటినది ము దున్నది
ప్రాచీనబర్హిః ఇ ద్రుడు
ప్రాచీనావీత అపసవ్యముగా ధరించ బడిన జ దెము
ప్రాచీరం గోడ క చె
ప్రాచుర్య తఱచు అధికము
ప్రాచేతసః మనువు దక్షుడు వాల్మీకి
ప్రాచ్య వి ము దున్న తూర్పున నున్న మొదటనున్న వెనుకటి. -చ్యాః తూర్పుదేశము తూర్పుదేశ పురాణ
ప్రాచ్యభాషా తూర్పుదేశపుభాష
ప్రాజనః - వం కొరడా
ప్రాజితృ పు ప్రాజిన్ పు సారథి
ప్రాజ్ఞ వి మేధావి బుద్ధిమంతుడు. జ్ఞ ప డితుడు
ప్రాజ్ఞా మ బితెలివి అవగాహన తెలివి కలస్త్రీ
ప్రాజ్ఞీ తెలివికలస్త్రీ ప డితునిభార్య.
ప్రాజ్య వి అధికము గొప్పది
ప్రా చ్ వి పూర్వీకుడు
ప్రాంజలిః లికః -లిన్ పు దోసలి పట్టి ఆదరము ప్రకటి చినవాడు
ప్రాణః వాయువు ప్రాణవాయువు
ప్రాణన జీవి చుట
ప్రాణనాథః ప్రియుడు యముడు
ప్రాణాచారః ఉపవాసము

ప్రాణయాత్రా బ్రతుకుతెరువు
ప్రాణాయామః ఒక యోగా గము శ్వాసమును నిలుపుట
ప్రాణిన్ వి ప్రాణము కలది పు జ తువు (మనుష్యాదులు)
ప్రాతర్ అ వేకువ ప్రాతఃకాలము
ప్రాతరాశః ఉదయపు భోజనము
ప్రాతికూల్య వ్యతిరేకత
ప్రాతివేశికః వేశ్యః పొరుగువాడు
ప్రాతిహారికః గారడివాడు
ప్రాథమిక వి ముఖ్యమైన మొదటి
ప్రాథమ్యం మొదటిదగుట
ప్రాదుర్భావః అగపడుట పుట్టుక
ప్రాదుస్-అ అగపడునట్లుగా
ప్రాదేశః బొటనవ్రేలిని చూపుడువ్రేలిని చాచిపట్టిన కొలత
ప్రాదేశన దానముచేయుట
ప్రాధాన్య ముఖ్యత ప్రధానత
ప్రాధ్వ వి దూరమగు పొడవైన కట్టబడిన అనుకూలముగా
ప్రా త కొన అ చు తీరము సమీపము
ప్రాంతరం నీడలేని దారి సుదూరమార్గము
ప్రాపణ చేరుట పొ దుట చేర్చుట.
ప్రాప్త వి పొ దబడినది స పాదిం చబడినది చేరినది
ప్రాప్తిః సి ,బలి చుట ఐశ్వర్యము.
ప్రాబల్య గొప్పదనము

ప్రాబోధ(ధి)కః వేకువ ప్రభాతము, ప్రాతఃకాలమున తమ యజమానిని నిద్ర లేపుటకు స్తోత్రాదులు చదువు వాడు

ప్రాభవం ప్రభుత్వము

ప్రాభృతం -తకం బహుమానము

ప్రామాణిక వి శాస్త్రసిద్ధమైనది -కః ప్రమాణములను అంగీకరించు వాడు శాస్త్రజ్ఞుడు

ప్రామాణ్యం విశ్వసనీయత ప్రమాణము అధికారము

ప్రాయః వెడలిపోవుట చావు ఉపవాసాదులచే మరణింపగోరుట బాహుళ్యము

ప్రాయశస్ అ సాధారణముగా తఱచుగా

ప్రాయశ్చిత్తం -శ్చిత్తిః సీ పాపము తొలగుటకు చేయు క్రియ.

ప్రాయస్ అ తఱచుగా

ప్రారబ్ధ వి. మొదలుపెట్టబడినది -బ్ధం మొదలుపెట్టబడినది, భాగ్యము.

ప్రారంభః పని మొదలు

ప్రార్థనం -నా యాచన కోరిక

ప్రార్థిత వి కోరబడినది అడుగబడినది కోరిక

ప్రార్థిన్ వి యాచించువాడు

ప్రాలేయం మంచు

ప్రావరణః - ణీయరు ఉత్తరీయము, ముసుగు

ప్రావారకః ఉత్తరీయము

ప్రావీణ్యం నేర్పు

ప్రావృతః -తం దుప్పటి

ప్రావృష్ సీ వర్షర్తువు

ప్రాశః -శనం తినుట, భోజనము

ప్రాశ్నికః పరీక్షకుడు ప్రశ్నించు వాడు

ప్రాసః ఈటె

ప్రాసాదః దేవాలయము రాజభవనము

ప్రాహ్ణః పూర్వాహ్ణము ఉదయము నుండి పది గడియల కాలము

ప్రియ వి ఇష్టమైనది, అభిలషితము -యః ప్రేమకలవాడు భర్త -యా ప్రియురాలు చిన్నయాలు కలు -యం ప్రేమ సంతోషము

ప్రియకః చిత్రవర్ణముకల జింక, కుంకుమము

ప్రియతమ వి మిక్కిలిప్రియము -మః ప్రియుడు భర్త -మా భార్య.

ప్రీ 1 9 ఉ (ప్రీణాతి ప్రీణీతే ప్రీత) సంతోషపెట్టు సంతృప్తిపఱచు, దయతో మాటలాడు 4 ఆ (ప్రీయతే)సంతోషించు

ప్రీణనం సంతోషపెట్టుట

ప్రీతిః సీ సంతోషము సుఖము అను కూలత స్నేహము

ప్రేక్షకః చూచువాడు

ప్రేక్షణం - ణా చూచుట నాటకము చూచుట బుద్ధి, ఆలోచన

ప్రేక్షావత్ వి బుద్ధిమంతుడు విద్వాం
సుడు
ప్రేంఖణం ఖా తిరుగుట ఊగుట
ఊయల
ప్రేంఖోలనం ఊగుట
ప్రేత వి లోకమును వీడిన, మర
ణించిన -తః మృతుడు దెయ్యము
ప్రేతాధిప యముడు
ప్రేమన్ న స్నేహము ప్రీతి దయ,
అనుకూల్యము
ప్రేయస్ వి మిక్కిలి ప్రియమైనది
పు ప్రియుడు భర్త సీ భార్య
ప్రేరణం ణా పురికొల్పుట
ప్రేష్ 1ఆ (ప్రేషతి -తే ప్రేషిత)
పోవుట కదలుట
ప్రేషణ ణా పంపుట
ప్రేష్ఠ వి మిక్కిలి ప్రియమైనది –
-ష్ఠః ప్రేమికుడు, భర్త – ష్ఠా భార్య
ప్రేష్య వి పంపదగినవాడు -ష్యః
సేవకుడు
ప్రైష్యః సేవకుడు దాసీసు
ప్రోక్షణ చల్లుట చిలుకరించుట
ప్రోత వి కుట్టబడినది కట్టబడినది
-తం వస్త్రము
ప్రోత్సారణ తోలుట వెడలగొట్టుట
ప్రోత్సాహః - హనం ఉత్సాహము
ప్రేరణము
ప్రోషిత వి దేశాంతరగతుడు

ప్రోష్ఠః ఎద్దు
ప్రౌఢ వి సమగ్రముగ వృద్ధినొం ది
నది వృద్ధుడు దట్టమైనది
గొప్పది గర్వముకలది
ప్రౌఢా సంపూర్ణయౌవనము నొం దిన
యాతుది
ప్రౌఢిః సీ పరిపూర్ణ వికాసము

ప్ల

ప్లక్షః జువ్విచెట్టు రావిచెట్టు ఒక
ద్వీపము
ప్లవ వి ఈదుట తేలుట దూకుట
-వః ఈదుట, తేలుట వరద
ఎగురు తెప్ప కప్ప కోతి
వర్ణము శత్రువు జాత్తై చండా
లుడు వల జువ్వి నీరుకాకి
ఏకాన్వయముకల ఐదారు శ్లోక
ములు ఒక సంవత్సరము
ప్లవగః కోతి కప్ప అనూరుడు
ప్లవ గః కోతి కప్ప ఒక వత్సరము
ప్లవంగమః కోతి కప్ప

ప్లు

ప్లు 1ఆ (ప్లవతే ప్లుత) ఈదుట
తేలుట నావచే దాటుట ఎగురుట
జారుట
ప్లుతః త్రిమాత్రా కాలముకల స్వరము
ప్లుతిః సీ వరద ఎగురుట అశ్వగతి
భేదము

ప్లుష్ట వి కాల్చబడినది

ప్లోషః కాల్చుట

ఫ

ఫక్కికా మాదిరి

ఫక్కి మాదిరి

ఫటః పాముపడగ

ఫణ్ 1ప (ఫణతి, ఫణిత) కదలుట

ఫణః ఫణా పాముపడగ

ఫణితం -తిః వాక్కు వి చెప్పబడినది

ఫణిన్ పు పాము

ఫల్ 1 ప (ఫలతి, ఫలిత) కాచు పండు సఫలమగు, ఫలితమునిచ్చు

ఫలం పండు పంట ప్రయోజనము, కార్యము లక్ష్యము, వృషణము సంతతి కత్తివాదర

ఫలకః ఫలక -కం కేడెము,

ఫలతః ఫలితాంశముగ

ఫలనం ఫలించుట కాచుట

ఫలపూరః మాదీఫలము

ఫలవత్ వి సఫలము, ప్రయోజనము కలది

ఫలిన్ వి పండ్లుకలది పు చెట్టు

ఫలేగ్రహి వి ఫలించునది

ఫల్గు వి సారములేనిది

ఫల్గునః అర్జునుడు

ఫా

ఫాలః,-లం నాగటికఱ్ఱు సీమంత ప్రదేశము (నెత్తి)[illegible] [illegible]

ఫు

ఫుల్ల 1ప (ఫుల్లతి ఫుల్ల) వికసించు, విప్పారు

ఫుల్ల వి వికసించినది

ఫే

ఫేనః -నం నురుగు

ఫేనిల వి నురుగుకలది

ఫేరవః, ఫేరుః నక్క

బ

బకః కొంగ మోసగాడు ఒక రాక్షసుడు కుబేరుడు

బకవైరిన్ బకజిత్ పు కృష్ణుడు, భీముడు

బడబా ఆడుగుఱ్ఱము, బ్రాహ్మణి బడబానలః సముద్రపు అగ్ని

బడిశం చేపలుపట్టు గాలము

బత అ ఆశ్చర్యము దుఃఖము సంబోధనము సంతోషములను సూచించు పదము

బదరం రేగుపండు ప్రత్తికాయ

బదరీ రేగుచెట్టు, ప్రత్తిచెట్టు

బద్ధ వి కట్టబడినది.

బధిర వి చెవిటివాడు

బందిన్ -దీ బంధనమందున్నవాడు చెఱలో నున్నవాడు

బంధ్ 9ప (బధ్నాతి బద్ధ) కట్టు చెఱపెట్టు సంకెలవేయు

బహుగుణ వి అనేక దొడ్డగుణములు కలది

బహుజల్ప వి వాగుడుకాయ

బహుతృణం గడ్డివలె అప్రధానమైనది

బహుదుగ్ధ వి ఎక్కువ పాలిచ్చునది

బహుదోష వి పెక్కుదోషములు కలది

బహుధన వి సంపన్నుడు

బహుప్రజ వి హెచ్చుగా సంతతి కల వాడు

బహుఫలః కదంబవృక్షము వి ఎక్కువ పండ్లు కలది

బహుమత వి గొప్పగా గౌరవింప బడినవాడు

బహుమతిః సీ బహుమానము గౌరవము

బహుమానః బహుమతి ఉపహారము గౌరవము

బహుమాన్య వి గౌరవింపదగినవాడు

బహుల వి దట్టము విశాలము సమృద్ధము పూర్ణము -లా ఆవు యాలుకలు -లం ఆకాశము

బహుశస్ అ అధికముగా తఱచుగా, సామాన్యముగా

బహుశ్రుతః పండితుడు

బహుసూతిః సీ ఎక్కువ యీతలీనిన ఆవు

## బా

బాడబః బడబాగ్ని బ్రాహ్మణుడు

బాఢ వి దృఢమైన అధికమైన -ఢం అ దృఢముగా నిజముగా

బాణః బాణము అవుపొదుగు ఒక రాక్షసుడు

బాధ్ 1ఆ (బాధతే బాధిత) పీడించు హింసించు, తొలగించు గాయపఱచు

బాధః - ధా దుఃఖము పీడ నిరోధము

బాధనం పీడించుట

బాధిత వి పీడితుడు దుఃఖితుడు తిరస్కృతుడు నిరుద్ధుడు

బాధిర్యం చెవుడు

బాంధవః బంధువు చుట్టము

బాంధవ్యం చుట్టరికము

బాలః -లకః చిన్న పసివాడు పదునారేండ్లకు లోబడిన వయస్సుకల వాడు

బాలతృణం లేతగడ్డి

బాలమూషికా చిట్టెలుక

బాలా బాలిక పదునారేండ్లకు లోబడిన వయసుకల యంగన కన్య

బాలిశః మూర్ఖుడు బాలుడు -శం తలగడ

బాల్యం చిన్నతనము

బాష్పం కన్నీరు -ష్పః ఆవిరి ఊష్మము

బాహుః భుజము గుజ్జము
బాహా భుజము
బాహుః భుజము ముంజేయి
బాహుజః క్షత్రియుడు
బాహుమూలం చంక
బాహుతః కోతి
బాహులేయః కుమారస్వామి
బాహుల్య సమగ్రత
బాహ్య వి వెలుపలిది

## బి

బిడ ఒకవిధమగు ఉప్పు
బిడాలః ఎల్లి కమగ్రుడ్డు
బిడౌజాః దేవేంద్రుడు
బింద్ 1ప (బిందతి) చీల్చు విభజించు
బిందు చుక్క మచ్చ సున్న
బిబ్బోకః స్త్రీల విలాసచేష్ట
బి బః -బం దొంతవ దు సూర్యుడు లేక చంద్రుని మండలము
బి బిత వి ప్రతిఫలించినది
బిల రంధ్రము పల్లము గోయి గుహ
బిలేశయః పాము ఎలుక -యా ఉడుము
బిల్వః మారేడుచెటు -ల్వం మారేడు పండు
బిసం తామర తూడు
బిసినీ తామరతీగె తామరతంపర
బీజ విత్తు మూలము వీర్యము
బీజపూరః -రకః మాదీఫలవృక్షము
బీజ్య వి విత్తునుండి పుట్టినది ఉత్తమ వంశమున పుట్టినవాడు
బీభత్సః ఒక రసము అరునుడు వి క్రూరుడు వికారము కలవాడు
బీభత్సుః అరునుడు

## బు

బుక్క 1ప 10ఉ (బుక్కతి బుక్కయతి-తే) మొఱుగు మాటలాడు
బుద్ధః బుద్ధుడు పండితుడు
బుద్ధిః సీ తెలివి
బుధిమత్ వి బుద్ధిమంతుడు
బుద్బుదః నీటిబుగ్గ
బుధ్ 1ఉ 4ఆ (బోధతి తే బుధ్య తే బుద్ధ)ఎఱుగుట గమనించుట ఆలోచించుట మేల్కొనుట తెలివి నొందుట
బుధ వి తెలివికలవాడు ధః పండితుడు ఒకగ్రహము
బుభుక్షా ఆకలి భుజించవలెనను కోరిక
బుభుక్షిత బుభుక్షు వి ఆకలిగొన్న వాడు
బుభుత్సా తెలిసికొనవలెనను కోరిక
బుభూష వి కాగోరువాడు
బుసం మీగడతీసిన పెరుగు పొల్లు

## బృ

బృంహ్ 1 ఔప (బృంహతి బృంహిత) పెఱుగుట వృద్ధినొందుట గర్జించుట

బృంహణం ఏనుగుచేయు ఘీంకారము

బృంహిత వి వృద్ధిచేయబడినది, గర్జితము - తం గజఘీంకృతి

బృహ్ 1 ఔప (బర్హతి బృహతి) పెఱుగు వృద్ధినొందు గర్జించు

బృహత్ వి పెద్దది గొప్పది విశాలమైనది బలవంతమైనది

బృహతికా ఉత్తరీయము

బృహతీ ఉత్తరీయము విశ్వావసుని వీణ ములకచెట్టు

బృహద్భానుః అగ్ని

బృహస్పతిః దేవగురువు

## బే

బేరం శరీరము వాహనము ప్రతిమ

## బై

బైల్వ వి మారేడుకు సంబంధించినది

## బో

బోధః జ్ఞానము

బోధకః ఉపాధ్యాయుడు—వి మేల్కొలుపువాడు ఉపదేశించువాడు

బోధిః సరియగు జ్ఞానము బుద్ధుని విశిష్టజ్ఞానము రావిచెట్టు కోడి

బోధిత వి తెలియజేయబడినవాడు, గుర్తుచేయబడినవాడు

## బ్ర

బ్రధ్నః సూర్యుడు

బ్రహ్మచారిన్ పు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడు

బ్రహ్మణ్య వి బ్రహ్మసంబంధమైనది వేదాధ్యయన సంబంధమైనది పవిత్రమైనది, బ్రాహ్మణునకు తగినది -ణ్యః వేదము చక్కగా అభ్యసించినవాడు గంగరావిచెట్టు, శని, విష్ణువు కుమారస్వామి - ణ్యా దుర్గాదేవి -ణ్యదేవః విష్ణువు

బ్రహ్మతా - త్వం పరమాత్మలో లీనమగుట

బ్రహ్మన్ న పరమాత్మ, వేదము తపస్సు

బ్రహ్మయజ్ఞః వేదపాఠము

బ్రహ్మరంధ్రం మాడు నడినెత్తి

బ్రహ్మవర్చసం వ్రతాధ్యయనసంపద.

బ్రహ్మవాదిన్ పు వేదాంతి

బ్రాహ్మ వి బ్రహ్మసంబంధమైనది

బ్రాహ్మణః బ్రాహ్మణుడు - ణం బ్రాహ్మణ సమూహము, వేదభాగము

బ్రాహ్మణబ్రువః జాతిచే మాత్రము బ్రాహ్మణుడు

బ్రాహ్మణీ బ్రాహ్మణుని భార్య

బ్రాహ్మణ్యం బ్రాహ్మణసమూహము

బ్రాహ్మి సరస్వతి పొన్నగంటికూర

బ్రూ 2ఉ (బ్రవీతి బ్రూతే) చెప్పుట

భ

భక్త వి విభజింపబడినది నిర్దేశింప బడినది సేవించబడినది అను రక్తుడు — క్తః పూజించువాడు విశ్వాసము కల సేవకుడు — క్తం భాగము, ఆహారము అన్నము

భక్తి స్త్రీ వేర్పాటు భాగము ఉపాసన సేవ అనురాగము

భక్ష్ 10ఉ (భక్షయతి తే భక్షిత) తినుట మ్రింగుట కీర్తి చకొనుట ఉపయోగించుట

భక్షణం భోజనము ఆహారము

భక్షకః జః తినువాడు జం తినుట

భక్ష్య వి తినదగినది క్ష్యం భోజ్య పదార్థము

భగః సూర్యుడు చంద్రుడు శివుడు అదృష్టము ప్రసన్నత సమృద్ధి ప్రసిద్ధి సౌందర్యము శ్రేష్ఠ ప్రేమ యోని సద్గుణము ప్రయత్నము సామర్థ్యము

భగవత్ వి ప్రసిద్ధుడు కీర్తిమంతుడు పవిత్రుడు పు దేవుడు విష్ణువు బుద్ధుడు జినుడు

భగినీ తోబుట్టువు

భగ్న వి విరిగినది చెడినది పట్టు కొనబడినది అపజయపడినది

భంగః విఱుగుట ముక్కలుచేయుట ముక్క విభాగము అంశము పతనము ఓటమి ఆటంకము పగులు రోగము

భంగా జనుము

భంగిః స్త్రీ — గీ విఱుగుట ముక్క విభాగము వంపు కెరటము వరద వ్యాజము మోసము అడుగో అంతరాళము నగు

భంగుర వి పగిలిపోవునది నశించునది మారునది

భజ్ 1ఉ (భజతి తే భక్త) పంచుట నిర్దేశించుట అభ్యసించుట అనుభవించుట సేవించుట గౌరవించుట

భజనం సేవించుట, పంచుట

భంజ్ 7ప (భనక్తి భగ్న) పగులు ముక్కలగు విఱుచు చెడగొట్టు ఓడించు

భంజన విఱుచుట చెడగొట్టుట — కః — నః విఱుచువాడు నాశము చేయువాడు

భటః యుద్ధముచేయువాడు యోధుడు

భట్టః యజమాని పండితుడు

భట్టార భట్టారక వి పూజ్యుడు మాన్యుడు

భటినీ (పట్టమహిషి కాని) రాజభార్య బ్రాహ్మణభార్య

భణ్ 1ప (భణతి భణిత) పలుకుట వర్ణించుట

భజనమ్, భణితమ్, భణితిః స్త్రీ చెప్పుట, పలుకుట, వర్ణించుట.
భండనమ్ యుద్ధము, కవచము, దుష్టత
భండారః బొక్కసము.
భదంతః బౌద్ధుడు, జైనుడు
భద్ర వి మంచిది సుఖకరమైనది; సమృద్ధమైనది శుభము ముఖ్యము, అనుకూలము, ప్రియము, సుంద రము. ద్రః ఎద్దు; కాటుకపిట్ట, ఒకజాతి యేనుగు, -ద్రః శుభము, సౌభాగ్యము, బంగారము, సమృద్ధి.
భద్రాసనం సింహాసనము
భయం భయము, మేలుపు
భయానక వి భయంకరము, ఒకా నొక కావ్యరసము
భరః బరువు
భరణం మోయుట, భరించుట
భరణి ఒక నక్షత్రము
భరణ్యం కూలి, బాడుగ
భరతః దశరథుని తనయుడు; దుష్యంతుని పుత్రుడు, నాట్యశాస్త్ర కర్త, -తం నాట్యశాస్త్రము
భరతఖండః హిమవత్పర్వతము - సేతువులకు నడుమనున్న భూమి
భరద్వాజః ఒకముని, ఏట్రింత పక్షి
భరిత వి నిండినది.
భర్గః శివుడు
భర్జనం వేంచుట

భర్తృ పు పతి, ప్రభువు వి. ముఖ్యుడు, పోషకుడు.
భర్తృదారకః యువరాజు
భర్తృదారికా రాజుకూతురు
భర్త్స 10 ఆ (భర్త్సయతే, భర్త్సిత) బెదరించుట.
భర్త్సకః బెదరించువాడు
భర్త్సనం, భర్త్సితం బెదరింపు.
భర్మన్ న కూలి, బంగారము
భల్లః ఎలుగుబంటు, బాణము, -ల్లం బల్లెము
భల్లుకః, భల్లూకః ఎలుగుబంటు
భవః శివుడు, ఉత్పత్తి, సంసారము, లాభము, ఉనికి
భవత్ వి నీవు, మీరు, జరుగుచున్న కాలము
భవదీయ వి నీది.
భవనం అగుట, ఇల్లు, నివాసము.
భవానీ పార్వతి
భవితం శుభము.
భవితవ్యం భాగ్యము, కాదగినది.
భవిష్ణుః కాదగినవాడు.
భవ్యం శుభము, యోగ్యము.
భవ్యా పార్వతి.
భష్ 1ప (భషతి) మొఱుగుట
భషకః, భషకః భషణః కుక్క.
భషణం మొఱుగుట.
భసితం భస్మము

